**Vuyyuru Vusulu**

**ఉయ్యూరు ఊసులు**

ప్రథమ ముద్రణ - 1000 ప్రతులు

శ్రీ వికృతి - కార్తీక మాసం

డిసెంబర్ - 2010

రచన : **గబ్బిట కృష్ణమోహన్** (ఎమ్.ఎస్.సి.)

ప్రచురణ : సరసభారతి

**సాహిత్య సాంస్కృతిక సంస్థ, ఉయ్యూరు**

ప్రతులకు : **గబ్బిట దుర్గా ప్రసాద్** (అధ్యక్షులు - సరసభారతి)

ఇ.నెం. : 2-405 శివాలయం వీధి,

రాజాగారి కోట దగ్గర ఉయ్యూరు - 521165

కృష్ణాజిల్లా.

ఫోన్. నెం : 08676-232797 సెల్: 99890 66375

ఇ. మెయిల్ : gabbita.prasad@gmail.com

sarasabharathi.vuyyuru@gmail.com

**గబ్బిట కృష్ణమోహన్ -** ఫ్లాట్ నెం.105, శ్రీ నిలయ

6-3-1099/1/9 సాగర్ వ్యూ అపార్ట్‌మెంట్స్ సోమాజిగూడ

హైదరాబాద్ - 82

ఇ. మెయిల్ : mohangabbita@gmail.com

ఫోన్. నెం : 040-66105247 సెల్.నెం. 9391152476

వెల : అమూల్యం.

డి.టి.పి : **వి.జి. షాప్, ఉయ్యూరు,**

సెల్ నెం. : 9849705663

ముద్రణ : **శ్రీ రామా గ్రాఫిక్స్, గాయిత్రీ గురుకులము, ఉయ్యూరు.**





# ఉయ్యూరు ఊసులు

## గబ్బిట కృష్ణమోహన్



సంపాదకులు

**గబ్బిట దుర్గాప్రసాద్**

ఎమ్.ఏ., బి.యస్‌సి., బి.యిడి.

ప్రచురణ

**సరసభారతి**

సాహిత్య సాంస్కృతిక సంస్థ ఉయ్యూరు,

కృష్ణాజిల్లా **521165**

# ఊసుల మోసుల క్రమం

# ఉర్వికి గర్వ కారణం - ఉర్వరాపురి (ఉయ్యూరు)

– గబ్బిట వెంకట రమణ

పవిత్ర కృష్ణానది తీరాన వుండి రైల్వేజంక్షన్‌గా, వ్యాపార వాణిజ్య కేంద్రంగా, విద్యా రంగంలో ప్రముఖ పట్టణంగా విలసిల్లే విజయవాడకు, జిల్లారాజధానిగా, సాంస్కృతిక కేంద్రంగా, బంగాళాఖాతానికి చేరువగా, నేత పరిశ్రమకు ఖ్యాతి చెందినదిగా వున్న మచిలీపట్నానికి , సుమారు మధ్యలో రోడ్డుపై వున్న మేజర్ పంచాయితీ ఉయ్యూరు గ్రామం . ఆ రెండు పట్టణాల మధ్యవారధిగా, ఆ వికాసాలకు ఆయువు పట్టుగా వుందీ గ్రామం. సుమారు 50వేల జనాభాతో పారిశ్రామిక కేంద్రంగా, విద్యావికాస నిలయంగా, సాహితీ సంస్కృతులకు ఆలయంగా వైద్యకేంద్రంగా, మండల కేంద్రంగా, శాసన సభానియోజక వర్గంగా, పూజ్యబాపూజి పాదస్పర్శలో పులకించి రాజకీయ ఆయువు పట్టుగా వెలుగుతున్నదది. ఉయ్యూరును పూర్వం “ఉర్వరా పురి” అని పిలిచేవారు. నూజివీడు రెవిన్యూ డివిజన్‌లో ఉయ్యూరు వుంది.

## పాడి పంటలకు నిలయం

కృష్ణానదిపై ఆనకట్టకట్టిన తర్వాత ఉయ్యూరు పరిసర గ్రామాలకు కృష్ణ కాలువల ద్వారా ముఖ్యంగా“పుల్లేరు” కాలువ ద్వారా సాగునీరు లభించి అప్పటిదాకా మెట్ట పంటలను మాత్రమే పండించే స్థితి నుంచి మారింది. బంగారు మాగాణి అయింది. పంటసిరి హెచ్చి, వ్యవసాయ దారులకు కొంగు బంగారం అయింది. స్వర్గీయ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారి చొరవ, ముందు చూపులతో ఏర్పడిన **K.C.P** పంచదార కర్మాగారం ఆసియాలోనే పెద్దది. చెరకు పంట విస్తీర్ణం పెరిగి, ప్రముఖ వాణిజ్యపంటగా రైతులకు కష్టాలను తీర్చే ఆపద్బాంధవిగా మారింది. లాభాపేక్ష మాత్రమే కాకుండా రైతులకు మిత్రునిలా ఫాక్టరీ అండదండగా నిలచింది. సబ్సిడీల రూపంలో ఎరువులు, క్రిమిసంహారకాలు, టైరుబండ్లు, గొట్టపు బావులకు ప్లాస్టిక్ ట్యూబులు, మోటర్లు వగైరాలను చెరకు రైతులకు అందజేసింది. దీన్ని యింకా పకడ్బందీగా నిర్వహించి, అటు ప్రభుత్వానికి, యిటు రైతులకు ‘లైజాన్’ గా వ్యవహరించటానికి ‘షుగర్ కేన్ డెవలప్ మెంట్ కౌన్సిల్’ కూడా ఏర్పడింది. ఇన్ని చేసినా సరియైన విత్తనం లభించక పోతే





రైతులకు శాపమే. అందుకనే సువిశాలమైన చెరకు **form** ను ఏర్పరచి తర్వాత చెరకు రిసెర్చ్ సెంటర్‌ను కూడా నెలకొల్పారు. అనేక రకాల నాణ్యమైన, తక్కువ కాలంలో అధిక దిగుబడి నిచ్చే చెరకు విత్తనాలు రూపొందాయి. ఇవన్నీ రైతులకు వరాలుగా మారాయి. ఎకరానికి 50–60 టన్నులుదాకా దిగుబడి నిచ్చి రాష్ట్రంలోనూ, దేశంలోనూ, ఉయ్యూరు చెరకు రైతు విజయ పతాకాన్ని ఎగుర వేశాడు, గుర్తింపు ప్రాధాన్యత పొందాడు. ఫ్యాక్టరీ యాజమాన్యం చెరకు రవాణా కోసం చక్కని రోడ్డు సౌకర్యాన్ని కల్పించింది. వేలాది కార్మికులకు వసతిని ఏర్పరచింది. చాలా ఏళ్లు **best management** అవార్డును ఫ్యాక్టరీ సాధించింది. ఫ్యాక్టరీని తీర్చిదిద్దిన ప్లాంట్ మేనేజర్లలో శ్రీ ఇంజేటి జగన్నాధరావు ‘అందరివాడు’ అనిపించుకున్నారు. రైతు, ఫ్యాక్టరీ, వర్కర్ల మధ్య విడదీయరాని సంబంధాన్ని కలిగించారు. సమ్మెలు లేకుండా సమిష్ట భాధ్యతతో ఫ్యాక్టరీ పనిచేయటం గర్వకారణం. ఇప్పటి జి.యం శ్రీ జి.వెంకటేశ్వరావు సేవా భావం మెచ్చదగినది. ఇక్కడి భూములు వరికి చాలా అనుకూలం. రెండు పంటలు పండించేవారు. ఎకరానికి 40 బస్తాల ధాన్యం దిగుబడి సాధించారు. 25 సంవత్సరాల క్రితం పత్తిని కూడా సాగు చేసి, అధిక లాభాలతో పాటు ‘పత్తిపెద్ద’ గా గుర్తింప బడ్డ రైతులూ వున్నారు. మెట్ట భూములు వుండటంలో పసుపు, కంద, తమలపాకు, కూరగాయలు కూడా బాగా పండుతున్నాయి.

**K.C.P.** ఫాక్టరీలో పూర్వం **confectionary** వుండేది. పిల్లలకు యిష్టమైన, పలురకాలు చాక్లెట్లు, బిళ్ళలు తయారు చేసేవారు. దానికి అనుబంధంగా, ఆల్కహాల్, షోడాగ్యాస్ కూడా వ్యర్ధపదార్ధాలతోతయారయేవి .ఉయ్యూరు షోడాగ్యాస్ ఆంధ్రరాష్ట్రంలోనే పెద్దపేరు తెచ్చుకుంది. ఇటీవల ‘అసిటిక్ ఆసిడ్ ప్లాంటును నిర్మించి ఉత్పత్తి చేస్తున్నారు. నవంబర్ నుంచి ఏప్రిల్ వరకు చెఱకు సీజన్.అందువల్ల పశుగ్రాసానికి ‘చెఱకు దవ్వ’ చాలా ఉపయోగపడుతుంది. కనుక పశుసంపద యిక్కడ హెచ్చు ‘డెయిరీ’లు కూడా నడుపుతున్నారు. హరిత విప్లవంతో పాటు శ్వేత విప్లవం కూడా ఉయ్యూరు సాధించింది. దీనికి తోడు “కోడిగ్రుడ్ల పరిశ్రమలు వచ్చాయి. ఈ విధంగా పాడి, పంటలకు నిలయమై సస్యశ్యామలమై, ఎప్పుడూ పచ్చగా, బంగారంగా మెరసి పోతూ ఉంటుంది ఉయ్యూరు.

## విద్యా, వైద్య కేంద్రం

ఉయ్యూరు పరిసర గ్రామాలకు పట్టణాలకు వెళ్లేసౌకర్యం తక్కువగా వున్న కాలంలో, యిక్కడి ప్రజలకు తక్కువ చదువుతో, మంచి ఉద్యోగాలు సంపాదించి, పారిశ్రామికంగా, దేశాభివృద్ధికితోడ్పడాలన్న పవిత్ర లక్ష్యంతో, స్వాతంత్రం రావటానికి పూర్వమే ఉయ్యూరు ప్రజల కోరిక, ప్రభుత్వచొరవ, రాజకీయ నాయకుల నిస్వార్థ దృష్టి వల్ల ఉయ్యూరులో సువిశాలమైన స్థలంలో గవర్నమెంటు పాలిటెక్నికల్ కాలేజి **I.T.I.** లు ఏర్పడ్డాయి. ఇవి ఎంతోమందికి జీవనోపాధిని కల్పించాయి. పాలిటెక్కిక్ చాలా ప్రాచుర్యం పొంది వేలాది ఇంజనీర్లు వివిధ శాఖల్లో పనిచేసి రాష్ట్ర, దేశాభివృద్ధికి తోడ్పడ్డారు. ఈ కాలేజిలను గొప్పగా నిర్వహించిన ప్రిన్సిపాల్స్ వేపా కృష్ణమూర్తి, పి.హెచ్.ఎన్.బి. శర్మ, జి.వి.ఎల్ మూర్తి గార్లు. అచారి మేష్టారు డ్రాయింగ్‌లో, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించటంలో దిట్ట. **I.T.I** చదివిన వారికి స్థానిక **K.C.P.** లో తేలికగా ఉద్యోగం లభించింది. ఆనాడు పాలిటెక్నిక్ కాలేజి విద్యతోపాటు, సాంస్కృతిక కేంద్రంగా భాసిల్లింది. ఎంతోమంది నాటక సినీ కళాకరుల్ని అందించింది. వార్షికోత్సవాలకు ప్రసిద్ధనటులైన 'స్థానం నరసింహారావు' ప్రసిద్ధ కవులైన విశ్వనాథ లాంటి ప్రజ్ఞా వంతుల్ని ఆహ్వానించి, గౌరవించి, సత్కరించింది అదొక స్వర్ణయుగం. అలాంటి సమయంలో విషబీజాలు పుట్టాయి. అనేక కారణాల వల్ల పాలిటెక్నిక్, **I.T.I** లు విజయవాడకు తరలి పోయాయి. ఇక్కడి విద్యార్థులకు తీవ్రనిరశ మిగిలింది. ఎన్ని సత్యాగ్రహాలు, నిరాహార దీక్షలు చేసినా ఫలితం లేక పోయింది. శ్రీ కొల్లి రామ్‌కుమార్ వర్మ 40 రోజులు నిరాహార దీక్ష చేబట్టారు. అయినా ఫలితం దక్కలేదు. నిస్తబ్ధత కొంతకాలం రాజ్యం చేసింది. అప్పుడు జనంలో ఆలోచన పెరిగింది. ఉయ్యూరును మళ్ళీ విద్యాకేంద్రంగా చేయలని ఆలోచన అన్నివర్గాల నుంచి ఊపునందుకుంది. చెరకు రైతులు సహకరించారు, వారికి వచ్చే డబ్బులు కొంత భాగం చందారూపంగా యిచ్చారు. కె.సి.పి. వెన్నెముక గా నిల్చింది. దానితో ఎ.జి. & ఎస్.జి. డిగ్రీ మరియు జూనియర్ కాలేజి ఏర్పడింది. విద్యార్థుల బాధలు తప్పాయి. మళ్ళీ విద్యా వికాసం ఆరంభమైంది. మంచి ఫలితాలను సాధించింది, స్థాయిని నిలబెట్టుకుంది. ప్రజలకు ఆశాజ్యోతిగా నిలచింది సిద్ధార్థ కళాశాల యాజమాన్యంలో యిప్పుడు ఎ.జి. & ఎస్.జి. సిద్ధార్థ కళాశాలగా మారింది. అనేక మైన కోర్సులు పెరిగాయి. పి.జి కోర్సువచ్చింది, లైబ్రరీ, లేబరేటరీ సౌకర్యాలు వృద్ధి





చెందాయి. క్రీడల్లో, సాంస్కృతిక వికాసంలో, సంఘసేవలో, ఎన్.సి.సి. విభాగంలో పేరు ప్రతిష్టలు సాధించి, అగ్రగామి కాలేజిగా, విలువలకు కట్టుబడిన కళాశాలగా నిలబడింది. మాదల కాశీవిశ్వేశ్వరరావు, ఘంటా బాల భాస్కరరావు, బి.వి.రాయుడు కళాశాలను తీర్చిదిద్దిన సమర్థులైన ప్రిన్సిపాల్స్.

1951లోనే ఉయ్యూరులో జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల వచ్చింది. వై గోపాలరావు కె.వి.ఎస్.ఎల్. నరసింహారావు, బులుసు గౌరీపతి శాస్త్రి, ఆచంట సత్యనారాయణ, ఎ. బలరామ మూర్తి, మిక్కిలినేని వెంకటేశ్వరరావు వంటి సమర్థులైన ఎంతో మంది ప్రధానోపాధ్యాయుల చేతిలో తీర్చిదిద్దబడింది. 1000పైగా విద్యార్థినీ,విద్యార్థులతో కళకళలాడుతుంది, స్వంత భవనాలు సంపాదించుకుంది కె.సి.పి. యాజమాన్యంలోని వి.ఆర్.కె.ఎం. హైస్కూలు జిల్లాలో అగ్రగామి సంస్థగా నిలబడింది. అలాగే సి.బి.యం. స్కూలు, వెనుక బడిన విద్యార్థులకు ఆసరాగా వుంది, అనేకమైన ఎలిమెంటరీ స్కూళ్ళు, మరి రెండు కళాశాలలు, ఐ.టి.ఐ. ఉయ్యూరు విద్యార్థులకు కోర్కెలను తీరుస్తున్నాయి. ప్రతిభకు ఆలవాలంగా వున్నాయి. హాస్టలు వసతులు ప్రభుత్వం కల్పించటం వల్ల ఎక్కువ మంది పేద విద్యార్థులు హాయిగా, ఆనందంగా చదువుకుంటున్నారు. ఉన్నత విద్య కొనసాగిస్తున్నారు. శ్రీ సీతంరాజు సత్యనారాయణ 'ఆంధ్ర టైప్ ఇన్స్టిట్యూట్ స్థాపించి సాంకేతిక విద్యనందించారు. టైప్, షార్ట్ హ్యాండ్ నేర్చి వేలాది మంది మంచి ఉద్యోగాలు సంపాదించారు. ఆ తరువాత లతీఫ్ గారి ఇన్స్టిట్యూట్ చెప్పుకోదగినది. ఇప్పుడు కంప్యూటర్ కేంద్రాలు చాలా వచ్చాయి.

విద్యకు ఆరోగ్యం కూడా ముఖ్యం. స్వాతంత్ర్యానికి పూర్వమే సి.బి.యం. హాస్పిటల్ ను కెనడియన్ బాప్టిస్ట్ మిషన్ వాళ్ళు ఏర్పాటు చేశారు. ప్రసూతి ఆస్పత్రులలో ఉన్నత మైందిగా పేరు తెచ్చుకుంది, వేలాది మంది ఆరోగ్యానికి భరోసాగా వుంది. అదొక దేవాలయం అనే భావన అందరిలోనూ వుంది. డాక్టరు టింఫిణి, డాక్టరు సుశీల నిస్వార్థ సేవ చేసి, రోగుల పాలిటి దైవాలుగా వుండేవారు. వారిద్దరు అంటే ప్రజలకు భక్తి, గౌరవాలు. నిస్వార్థ సేవకు ఎప్పుడూ అంతటి గౌరవం వుంటుంది, శ్రీ నరసింహమూర్తి, మిక్కిలినేని సాంబశివరావు, కనకమేడల రంగారావు బొబ్బా సత్యనారాయణ గొప్పవైద్యులుగా ప్రసిద్ధిచెందారు. తర్వాత ప్రభుత్వ ఆస్పత్రి వచ్చింది.

ఈ రెండూ కె.సి.పి. యాజమాన్యం చొరవ, దాతల దాతృత్వ ఫలితాలు కంటి ఆస్పత్రి వేలాది కంటి వ్యాధి గ్రస్తులకు చూపునిచ్చింది. ఆధునిక పరికరాలతో లేజరు శస్త్ర చికిత్సలు యిక్కడ ప్రత్యేకత. రాష్ట్ర నలుమూలల నుంచి నిత్యం వందలాది మంది వచ్చి పరీక్ష చేయించుకుంటారు. డాక్టర్ రతన్‌కుమార్ దంపతులు ప్రజల మనస్సుల్లో చిరస్థాయిగా నిల్చారు. చాలా చవకగా, తేలికగా వైద్యం అందుతుంది. ఆస్పత్రి ఆధునిక సౌకర్యాలతో కంటి ఆస్పత్రిగా రాష్ట్రంలోనే మంచి పేరు తెచ్చుకుంది. ఆనాడు ఆయుర్వేదంలో వేదాంతం రామచంద్రాచార్యులు, నారాయణాచార్యులు, బుర్రాశేషయ్య, మామిళ్ళపల్లి నాగేశ్వరరావులు ప్రసిద్ధవైద్యులు.

ఇటివలీ కాలంలో చాలా ప్రైవేటు ఆస్పత్రులు వెలిశాయి . స్పెషాలిటీ ఆస్పత్రులు వచ్చాయి. అన్ని రకాల జబ్బులకు చికిత్స చేస్తున్నారు. విజిటింగ్ డాక్టర్లు, ఎక్స్‌పర్ట్‌లు సలహాలనిస్తున్నారు. కాటూరు రోడ్డు యిప్పుడు, హాస్పిటల్ రోడ్ అయింది. ఆలా విద్యా వైద్య రంగల్లోనూ ప్రముఖ స్థానం సంపాదించింది వుయ్యూరు. సీతంరాజు సాంబశివరావు హెడ్ కరణం– సీతంరాజు లింగరాజు చిన్నకరణం. జనులకు తలలో నాలుకగా వుండేవారు. ఉయ్యూరు మునసబుగా పని చేసిన వారిలో రాజరాజ నరేంద్రుడు, వల్లభనేని గోపాలకృష్ణయ్య , మీసాల మునసబు ప్రసిద్ధులు. ఉయ్యూరు వాస్తవ్యులు వారణాసి సదాశివరావు గారు, జిల్లాజడ్జిగా పనిచేయటం, గుండు అంతర్వేదిగారు రాజమండ్రిలో సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా పని చేయడం, వీరి కుమారుడు గుండు వరాహనరసింహమూర్తి (అప్పనకొండ) జంషెడ్‌పూర్‌లోని టాటా ఐరన్ అండ్ స్టీల్స్ ఫ్యాక్టరీలో చీఫ్ కెమిస్ట్‌గా పనిచేసి ఉయ్యూరుకి కీర్తి తెచ్చారు. ఉయ్యూరు పంచయతీ రెండవ వార్డు మెంబరులుగా గోవిందరాజుల సత్యం, కొలచల చలపతి ప్రజాసమస్యలను పరిష్కరించటంలో ముందుండేవారు. ప్రపంచ ప్రసిద్ధ ఆర్థికవేత్త, అంతర్జాతీయ ద్రవ్యనిధిలో 30 సంవత్సరాలుపైగా పని చేసి ప్రస్తుతం అమెరికాలో ఉంటున్న శ్రీ ఆరికపూడి ప్రేమ్‌చంద్ ఉయ్యూరు వాసి అవడం గర్వకారణం. హ్యామ్‌రేడియో స్థాపించి ప్రకృతి వైపరీత్యాలలో ప్రజా సేవ చేస్తున్న సూరి శ్రీరామమూర్తి ఉయ్యూరు వాడే. ప్రముఖ శాస్త్రవేత్త, నెహ్రూకు సైంటిఫిక్ సలహాదారు శ్రీసూరి భగవంతం ఉయ్యూరు తరచుగా వస్తుండేవారు. వీరికి ఇక్కడ స్థిరాస్థులు, బంధుత్వం ఉండేది. ప్రఖ్యాత ఆర్థికవేత్త, ఐ.ఎం.ఎఫ్.లో పని చేసిన వారు, రిజర్వ్ బ్యాంక్‌లో అత్యున్నత ఉద్యోగి అయిన





శ్రీనోరి ఆదినారాయణ శర్మ ఉయ్యూరు గ్రామస్తుడే. కర్ణాటకలోని కోలార్ బంగారు గనులలో అత్యున్నత అధికారిగా పని చేసిన సూరి శోభనాచలపతిగారి కుమారుడు శ్రీరామమూర్తి ఉయ్యూరు బంగారమే.

శ్రీ సీతాంరాజు కోటేశ్వరరావు, శ్రీవేమూరి శివరామకృష్ణయ్య, శ్రీ నూతులపాటి బ్రహ్మాజీరావు(కటకటాల మేష్టారు), ఆదిరాజు శ్రీరాములు, వత్తుమిల్లి సుబ్బారావు (సుబ్బారావు బడి) మేస్టారు, ముత్తయ్య మేస్టారు, సూరి పార్థిమేస్టారు, ఆదిరాజు పున్నయ్య గొప్పట్యూటర్‌లుగా పేరుపొందారు. వందల మంది విద్యార్థులు వారి దగ్గర చదువుకున్నారు. శ్రీ పుచ్చా శివయ్యగారు, శ్రీ అన్నే హనుమంతురావు స్థాపించిన సరస్వతి ట్యూటోరియల్ కాలేజి మెట్రిక్ విద్యార్థులకు గొప్ప వరంగా వుండేది.

## రాజకీయ కేంద్రం

మొదటినుంచి ఉయ్యూరు రాజకీయ కేంద్రం. హేమాహేమీ నాయకుల్ని గెలిపించింది, ఓడించింది కూడా. ధన, అధికార గర్వంలో విర్రవీగే ఏ నాయకుణ్ణైనా ఉయ్యూరు ప్రజలు వదిలిపెట్టలేదు. బుద్ధిచెప్పారు. చావు దెబ్బ కొట్టారు. రాష్ట్ర రాజకీయాలకు, దేశ రాజకీయాలకు యిది 'యాసిడ్ టెస్ట్' లాంటి నియోజకవర్గం. స్వర్గీయ కాకాని వెంకటరత్నం గార్ని రెండు సార్లు గెలిపించింది. ఓక సారి ఓడించింది. రాష్ట్ర మంత్రిగా ఆయన మాత్రమే యింతవరకు ఉయ్యూరుకు ప్రాతినిధ్యం వహించారు. తర్వాత డాక్టరు కనకమేడల రంగారావు, వడ్డే శోభనాద్రీశ్వరరావు, అన్నే బాబురావు, అన్నే విజయలక్ష్మీ, కొలుసు పార్థసారధి ఉయ్యూరు శాసనసభ్యులైనారు. ఇటీవలి ఎన్నికలలో (2009), నియోజకవర్గాల పునర్విభజనలో, ఉయ్యూరు నియోజక వర్గం రద్దయి , ఉయ్యూరు పెనమలూరు నియోజక వర్గంలో చేరింది. శ్రీ కొలుసు పార్థసారథి మళ్ళీ శాసనసభ్యులుగా గెలిచారు, రాష్ట్ర పాడిపరిశ్రమల శాఖామాత్యులవటం ఉయ్యూరుకు గర్వకారణం. అలాగే శాసనమండలిని పునరుద్ధరించిన తర్వాత శ్రీ యలమంచిలి వెంకట బాబు రాజేంద్ర ప్రసాద్ పెద్దల సభకు ఎన్నికైన చిన్నవాడుగా గుర్తింపు పొందారు.శ్రీ వడ్డే శోభనాద్రీశ్వరరావు పార్లమెంట్ మెంబరుగా కూడ పనిచేశారు. సమర్థులయిన పంచాయితీ ప్రెసిడెంట్లను ఎన్నుకున్న గ్రామమిది. అలీంసాహెబ్, డా॥కనకమేడల రంగారావు, ప్రెసిడింట్ రామారావుగా పిలువబడే

వెంట్రప్రగడ రామారావు, ఊర వెంకటేశ్వరరావు, గెల్లి మల్లికార్జునరావు, అన్నే బాబురావు, వై.వి.బి. రాజేంద్రప్రసాద్, వై భ్రమరాంబ ఉయ్యూరును తీర్చిదిద్దిన సర్పంచులు. ప్రస్తుత సర్పంచ్ శ్రీ అంగడాల వెంకటేశ్వరరావుకు ప్రజల్లో మంచి పేరువుంది.

చాలా కాలంగా ఉయ్యూరు లో పోలీస్‌స్టేషన్ వుంది, ఇప్పుడు అర్బన్, రూరల్ పోలీస్ స్టేషన్‌లు వచ్చాయి. సర్కిల్ ఆఫీస్‌కూడా వచ్చింది. ఫైర్ స్టేషన్ కూడా వుండడం ప్రత్యేకత.వాణిజ్యపన్నుల ఆఫీసు, ట్రాన్‌పోర్టు ఆఫీసు ప్రజలు అవసరాలు తీరుస్తున్నాయి. స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఇండియన్ బ్యాంక్, ఆంధ్రాబ్యాంక్, **S.B.H.** లు ప్రజల ద్రవ్యలావాదేవీలకు తోడ్పడుతున్నాయి, రైతులకు విద్యార్థులకు ఋణాలనిస్తూ ఆదుకుంటున్నాయి. **L.I.C** ఆఫీసు, భీమా సౌకర్యంలో మంచిసేవలందిస్తోంది, రైతుల పాలిటి కల్పవృక్షమైన కృష్ణా కో-ఆపరేటివ్ బ్యాంక్ వుంది. ఉయ్యూరులో ఠాణా ఉండేది. గంటలు కొట్టి సమయాన్ని తెలియజేసేవారు. మంచి సిమెంట్ రోడ్లతో, డ్రెయినేజీ సౌకర్యంతో, రక్షిత మంచినీటి సరఫరాతో, నిరంతరంగా విద్యుత్ సరఫరాతో, విద్యుత్ దీపాలతో నిత్యం కళకళలాడుతుంది ఉయ్యూరు.

మొదటి ఏ.సి లైబ్రరీ ఉయ్యూరు ప్రత్యేకత. జిల్లా గ్రంథాలయ సంస్థ యాజమాన్యంలో ఉయ్యూరు నివాసి, ప్రస్తుతం అమెరికాలో స్థిరనివాసం వుంటున్న శ్రీ మైనేని గోపాలకృష్ణ భూరి విరాళంతో, సహకారంతో నిర్మించబడింది. దీని నిర్మాణానికి వై.వి.బి. రాజేంద్రప్రసాద్, ఆనాటి కృష్ణాజిల్లా గ్రాంథాలయసంస్థ అధ్యక్షులు గొర్రెప్రాటి గోపీచంద్, గ్రంథాలయోద్యమసారధి వెలగా వెంకటప్పయ్య గార్లు గొప్ప కృషిచేశారు. శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ నిర్మాణ కమిటీ కన్వీనర్‌గా పనిచేసి, సర్వాంగ సుందరంగా, నిర్మించి, దాతలిచ్చిన ప్రతిరూపాయికి లెక్కలు అందజేసి మన్ననలు పొందారు.

* * *







## ధార్మిక కేంద్రం

దాదాపు వెయ్యి సంవత్సరాల దేవాలయ చరిత్రవుంది. శ్రీ సోమేశ్వరస్వామి దేవాలయం నూజివీడు సంస్థానాధీశులు నిర్మించినది. అలాగే విష్ణ్వాలయం కూడా వారిదే. వారి గోత్ర నామాలతో మొదటి పూజ వుంటుంది. వారేవంశపారంపర్య ధర్మ కర్తలు. డాక్టరు ఎమ్ అర్. అప్పారావుగారికి ఉయ్యూరు అంటే అభిమానం, చాలా సార్లు సందర్శించారు. మంత్రిగా, వైస్ ఛాన్సలర్‌గా, ఎమ్.ఎల్.ఎ. గా వారు ఎంతో ప్రజాసేవ చేశారు. ఉయ్యూరులో 'రాజాగారి కోట' విడిది కేంద్రం.

మాఘ శుద్ధ ఏకాదశి నుంచి బహుళ ఏకాదశి వరకు వీరమ్మతల్లి సంబరాలు 15 రోజులు జరుగుతాయి. ఊరంతా పెళ్ళి సందడి. గండ దీపం చేత్తోపట్టుకుని, బండారును నుదుట ధరించి అమ్మవారి ఊరేగింపుతో వస్తుంటే ప్రతి స్త్రీ ఓ వీరమ్మతల్లి లా కనిపిస్తుంది. భక్తిభావం పొంగి పొర్లుతుంది. గుడిదగ్గర సందడే సందడి. నిత్యం వేలాది మంది అమ్మవారిని దర్శించి తరిస్తారు. కె.సి.పి. యాజమాన్యంలో 'శ్రీసాయిబాబా మందిరం' నడుస్తోంది. తర్వాత అయ్యప్ప దేవాలయం, సాయి మందిరాలు, బ్రహ్మంగారి గుడి, గీతామందిరాలు, ప్రసిద్ధమైనవి. ప్రతి ఇల్లు బంధుమిత్రుల సందడితో కళకళ లాడిపోతుంది. ఆ 15 రోజులు యిళ్ళలో కారం కాని, పసుపు కాని కొట్టరు, వివాహాలు కూడా చేయరు, సిడిబండి యిక్కడి ప్రత్యేకత. మొక్కుబడులు చెల్లిస్తారు, గాజుల దుకాణాలలో గాజులు తప్పకకొని స్త్రీలు ధరించటం రివాజు. పొర్లుదండాలు, సంతాన ప్రాప్తికై తడిబట్టలతో దీక్షగా ఆలయం బయట సాష్టాంగాలు చూస్తుంటే అమ్మవారి మహాత్మ్యం ఎంత గొప్పదో తెలుస్తుంది. శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయం దాదాపు 300 సంవత్సరాల చరిత్ర కలిగింది. భక్తులు మనోభీష్టాలను నెరవేర్చే దేవుడిగా ప్రసిద్ధి చెందింది, ధనుర్మాసంలో ఉదయం 4 గంటల నుండి ప్రత్యేక పూజలు జరుగుతాయి. వందలాది భక్తులు ప్రదక్షణాలు చేస్తారు, వైశాఖ బహుదశమినాడు శ్రీ హనుమజ్జయంతి, శ్రీ సువర్చలాంజనేయ స్వామి వారి కళ్యాణం అత్యంత వైభవంగా జరుగుతాయి. దీనికి గబ్బిటవారు శాశ్వత వంశపారంపర్య ధర్మకర్తలు. గుండు లక్ష్మీ నరసింహావధానులు (గబ్బిట నాగమ్మగారి తండ్రి) దీన్ని నిర్మించారు. తరువాత ఆయన దౌహిత్రుడు గబ్బిట మృత్యుంజయ శాస్త్రి ధర్మకర్త అయ్యారు. ప్రస్తుతం వారి కుమారుడు గబ్బిట దుర్గాప్రసాద్ వంశపారంపర్య ధర్మకర్తగా ఉన్నారు.

పురోహితులలో కొలచల వెంకటేశ్వర్లు, వంగలసుబ్బావధాని, పాలపర్తి యజ్ఞన్న, పాలపర్తి వెంకట్రామయ్య, కోటకృష్ణమూర్తి, బెల్లంకొండ సుబ్బయ్య, యనమండ్ర పార్థసారధి గార్లు ఆనాటి ప్రసిద్ధులు. ఇప్పుడు చాలామంది కొత్తవారు వచ్చారు.

## వ్యాపార కేంద్రం

పూర, వెంట్రప్రగడ, బూరగడ్డ కుటుంబాలు మొదటి నుంచి కిరాణా, వస్త్ర వ్యాపారంలో పేరుపొందాయి. పువ్వాడవారు ఆయిల్ వ్యాపారంలో స్థిరపడ్డారు. ఇనుము, సిమెంటు, ఇటుక వ్యాపారం బాగా జరుగుతుంది. శ్రీరాములు గారి అడితి, పిల్లిమాణిక్యం అడితి, సాయిబాబా టింబర్ డిపో, యరా రామరావు, యరా రామకృష్ణ టింబర్ డిపోలు కలప వ్యాపారంలో ప్రసిద్ధి చెందాయి. ఇప్పుడు సుధీర్ టింబర్ డిపో రాష్ట్రంలోనే అగ్రగామిగా ఉంది. రంపపు కోత మిల్లులూ ఉన్నాయి. ఉమా ప్రెస్ స్థాపించి ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు ఉయ్యూరులో ముద్రణ సౌకర్యం కలిగించారు. పండ్ల వ్యాపారమూ మొదలునుంచి వుంది. ధాన్యం, అపరాలు కొనే వ్యాపారులున్నారు. ధాన్యం ఆడే రైస్ మిల్లులు ఎక్కువే. నాణ్యమైన తాపీ, వడ్రంగి పనివారున్నారు. మణిహోటల్, ఉడిపి హోటల్, మద్రాసుహోటల్, కేరళగోపి సోదరుల హోటళ్ళు బాగా వుండేవి. రామినేని బుచ్చిబాబుగారి ఏకాంబరేశ్వరపిక్చర్ ప్యాలెస్ ఇక్కడే రిజిస్ట్రార్ అఫీస్ వెనుక వుండేది. అది లక్ష్మీ టాకీస్ అయ్యింది. ఇప్పుడు ఆరు థియేటర్లు ఉన్నాయి. ధాన్యపు మిల్లులలో వంతెన దగ్గర అన్నే వారిది, కంతేటి వారిది, ఆదిరాజు చంద్రమౌళిగారిది, కాటురురోడ్డులో పొగాకు ముసలయ్య గారిది ఉండేవి. మొదటి నుంచి ఉయ్యూరులో పోస్టాఫీస్ వుంది. షేక్ ఆలి అనే పోస్ట్‌మాన్ చాలాకాలం పనిచేసి అందరిమన్నలు పొందాడు. సారధి ఫోటోస్టూడియో, ఎవరెస్టు ఫోటో స్టూడియోలు పేరుపొందినవి. ఇక్కడే పెద్దమశీదు, చిన్నమశీదు, సి.బి.ఎమ్ చర్చి ప్రసిద్ధమైనవి. సి.బి.ఎమ్ హాస్పటల్ దగ్గర వంగల వారి సత్రం రోగుల బంధువులు వుండటానికి, వంట చేసుకోవటానికి అనువుగ వుండేది. శివాలయం దగ్గర సీతంరాజువారి సత్రం కూడ చెప్పుకోదగినది.

* * *





ప్రతి మంగళ, శనివారాలలో భక్తులు విశేషంగా సందర్శించి పూజలు చేస్తారు. తమల పాకులు పూజలు చేయించి, అప్పాలు నైవేద్యం పెట్టించి భక్తులు ఆనందించి తరిస్తారు. దేవాలయాలో ధార్మిక కార్యక్రమాలు జరుగుతాయి. ఉగాది పంచాంగ శ్రవణం వుంటుంది. కార్తీక సమారాధనలు, కార్తీక మాసంలో శివునికి అభిషేకాలు బాగా జరుగుతాయి ఇలా ధార్మిక కేంద్రంగా ఉయ్యూరు వర్ధిల్లుతుంది. పాల్గుణ పౌర్ణమికి హరిజన వాడలో నాంచారమ్మ తల్లి సంబరాలు వైభవంగా జరిగేవి. వందకు పైగా ఎడ్లబండ్లతో, ఎత్తైన ప్రభ అలంకారంతో ఊరేగింపు జరిగేది. డప్పులు, కోలాటాలు, విద్యుద్దీపాలతో పగలే వెన్నెలగా వుండేది. ఊరంతా పండుగగా తెల్లవార్లు ఊరేగించేవారు. సంబరం నిర్వాహకులు నాంచారమ్మ వేషంలో చీర ధరించి, జడ, పూలు, గాజులతో ఊరేగేవారు. అన్నికులాల వారు అతనిరాక కోసం తెల్లవార్లు నిరీక్షించేవారు. ఆయన గతించిన తర్వాత ఆశోభతగ్గిపోయింది.

వైశాఖపౌర్ణమికి విష్ణ్వాలయంలో కళ్యాణం జరిగేది. ధర్మకర్త, కరణం అయిన ఆదిరాజు నరసింహారావు కళ్యాణ సమయంలో అందరికి బంగినపల్లి మామిడి పండ్లు పంచిపెట్టటం ప్రత్యేకత, మాఘ పౌర్ణమికి శివాలయంలో శ్రీజగదాంబా సమేత సోమేశ్వరస్వామి వార్ల కళ్యాణం జరుగుతుంది. ఇప్పుడు దసరాల్లో, కార్తీకమాసంలో శివాలయం ప్రత్యేకత సంతరించుకుంటే, విష్ణ్వాలయంలో ధనుర్మాసంలో ప్రత్యేకత పొందింది. ఇక్కడ భక్తులంతా కలసి నగర సంకీర్తన చేస్తారు. వచ్చిన ద్రవ్యంతో ధనుర్మాసం అయిన తర్వాత ఆదివారంనాడు విష్ణ్వాలయంలో అందరికి అన్నసమారాధన చేస్తారు. విష్ణ్వాలయంలో వైఖానస సభలు బ్రహ్మాండంగా జరిగేవి. దాలిపర్తి పిచ్చిహరి వంటి నాదస్వర విద్వాంసులను ఆహ్వానించి కచేరీలు ఏర్పాటు చేసేవారు. చోడవరపు వారి ఆధ్వర్యంలో గుండు గంగాధర శాస్త్రి గారి నిర్వహణలో 'శ్రీ రామచంద్ర వైదిక మహాసభ' ఏర్పడింది, వేదపండితులను ఆహ్వానించి, వేదసభలు జరిపించేవారు. ఇప్పుడు ఆ సంస్థ లేదు, గుండుగంగయ్య గారు పురాణ ప్రవచనం చాలా ఏళ్ళుచేశారు, ప్రతిఫలా పేక్ష లేకుండా. ఆదిరాజు చంద్రమౌళిగారి వదినగారు భాగవత సప్తాహాలు నిర్వహించేవారు. గంగానమ్మ జాతర బాగాచేస్తారు. ఉయ్యూరులో విష్ణ్వాలయంకు వేదాంతంవారు, రొంపిచర్లవారు, శివాలయానికి మామిళ్ళపల్లివారు వంశపారంపర్య అర్చకులు.

## ప్రత్యేకత

ఉయ్యూరులో బ్రాహ్మణులు, వైశ్యులు, కాపులు, కమ్మవారు,రెడ్లు, కంసాలులు, నాయిబ్రాహ్మణులు, కమ్మర్లు, కుమ్మర్లు,గౌడులు, గొల్లలు, మాలలు, మాదిగలు, ఎరుకలు, ఏనాదులు, లంబాడిలు, చెంచులు,చాకలి,ముస్లింలు క్రైస్తవులు, మొదలైన అన్ని కులాల వారున్నారు. ఎన్ని కులాలు ఉన్నా, ఎన్ని మతాలు ఉన్నా ఉయ్యూరులో మతసంఘర్షణలు లేవు. అన్ని కులాల వారు పరస్పరం గౌరవించుకుంటూ, అన్యోన్యంగా మెలుగుతు, సంఘంలో గౌరవప్రద జీవితం గడుపుతున్నారు. అనేక రాజకీయ పార్టీలువున్నా, పార్టీపరమైన తగాదాలు లేవు. ఐకమత్యానికి, మత సామరస్యానికి ఉయ్యూరు తన ప్రత్యేకతను అనాటి నుంచి ఈనాటివరకు నిలబెట్టుకున్నది. ఎన్ని ఉద్యమాలు వచ్చినా, ఎన్ని అభిప్రాయ భేదాలున్నా, కలిసికట్టుగా జీవించి మనమంతా భారతమాత బిడ్డలం అన్న పవిత్ర ఆశయంతో సంఘీభావంతో యిక్కడి వారు జీవించటం ప్రత్యేకంగా పేర్కొనవలసిన విషయం. అందుకే ఆదర్శగ్రామంగా ఉయ్యూరు పేరు తెచ్చుకుంది.

## కళా సాహిత్య సాంస్కృతిక కేంద్రం

పూర్వం ఉద్దండులైన పండితులు, వేదాధ్యయన సంపన్నులు ఉండేవారు. గాయత్రి అనంతరామయ్య, కొలచల అంతర్వేది, చెరుకుపల్లి శాస్త్రీగారు వారిలో ప్రసిద్ధులు. అతిథులు ఏవేళవచ్చినా సంతృప్తిగా భోజనం పెట్టే గృహస్తులు గుండు వారు, గబ్బిట వారు, కొలచల వారు, వారణాశి వారు, చోడవరపువారు వుండేవారు. విద్యకోసం వచ్చిన విద్యార్ధులకు వారాలు యిచ్చి విద్యకు ప్రోత్సాహం యిచ్చేవారు. విద్యాదాన కేంద్రాలుగా యిళ్ళుండేవి. గురుకుల విద్యాభ్యాసం కూడా వుండేది. కొలచల సీతారామయ్యగారు రష్యా వెళ్ళి అక్కడ గొప్ప శాస్త్రవేత్తగా ప్రసిద్ధి చెందారు. అయన రెండు సార్లు ఉయ్యూరు వచ్చి పురసన్మానం పొందారు. సూరి సీతారాం గోవా విమోచనోద్యమంలో పాల్గొని అసువులు అర్పించిన అమరజీవి. ఆయన విగ్రహం స్థానిక కాలేజీ దగ్గర వారి కుటుంబ సభ్యుల యింటి ప్రాంగణంలో ఉంది. వీణ, వయొలిన్ తబలా వాద్యాలను అద్భుతంగా పలికించే ముళ్ళపూడి వెంకటేశ్వరరావు, పాలపర్తి వెంకట్రామయ్య, మద్దెల రంగారావు, గరికపాటి కోటయ్యదేవరగారి కుమార్తె వుండేవారు. సంగీత విద్వాంసులకు నిలయంగా వుండేది. వ్యాకరణ శిరోమణి,



ఉయ్యూరు ఊసులు

తర్కశాస్త్రపారంగతుడు స్వర్గీయ వంగల సుబ్రహ్మణ్య శర్మగారు, వేదాంత ప్రవచనంలో దిట్ట, స్వర్గీయ చివుకుల వెంకట రమణ సిద్ధాంతిగారు. అన్నిట ప్రజ్ఞకలవారు శ్రీ వంగల కృష్ణదత్తశర్మ. వారిసోదరి ప్రయాగ కృష్ణవేణి జ్ఞాపకార్ధం ఒక బ్లాకును జెడ్.పి.హైస్కూలో కట్టించిన దాత దత్తుగారు. కోట శ్రీ రామమూర్తి, గుండుగంగాధరశాస్త్రి జ్యోతిషశాస్త్రంలో ఉద్దండులు, శ్రీ వెంకటేశ్వరరావు, చంద్రయ్య, మహంకాళి సుబ్బరామయ్య, కెవిఎస్ఎల్ నరసింహారావులు భక్తిభజనలో ప్రసిద్ధులు. ఇప్పుడు కూనపరెడ్డి వెంకటేశ్వరరావు, పువ్వాడ వెంకటేశ్వరరావు ప్రసిద్ధులు. చేవూరి కనకరత్నం, జగన్నాధ్ దాసు మంచి హరికధకులు. దేశభక్తి, జాతీయ భావాలను వ్యాప్తి చేసే రాష్ట్రీయ స్వయం సేవక సంఘం (ఆర్ఎస్ఎస్) బలీయంగా ఎన్నో శాఖలతో వర్ధిల్లింది. శివాలయం శాఖ పాలిటెక్నిక్ విద్యార్ధులతో నిండిపోయేది. ఉమామహేశ్వరరావు, సాగర్, పేర్ని కోటేశ్వరరావు, మండా వీరభద్రరావు, మాధవాచార్యులు, మండా ప్రసాదు, బాలాజీ క్రమశిక్షణ గల కార్యకర్తలు. పౌర్ణమి నాడు 'కోజాగరి' బాగా జరిగేది.

అవినీతిని అద్దం పెట్టి చూపించే, 'నెత్తురుకలం' పత్రిక ఇక్కడ ప్రారంభించి అవినీతిపరుల గుండెల్లో నిద్రపోయారు స్వర్గీయ మన్నె శివరాం. అనేకమంది సాహితీపరుల్ని ఆహ్వానించి సన్మానించిన సాహితీ మనస్కులు. రావూరి భరధ్వాజ, శారదతో సహజీవనం చేసిన ఆలూరి భుజంగరావు ఇక్కడ వుండి చాలా రచనలు చేశారు. రాహుల్ సాంకృత్యాన్ రచనలు ఓల్గా సేగంగా వగైరాలు అనువదించిన హిందీ పండితుడు. హిందీ ప్రేమీ మండలిని నడిపించి చాలా మందికి ఉద్యోగ సమపార్జనకు సహకరించారు శ్రీ మార్తి గంగాధర శాస్త్రి. 'నన్నయ్య కళాసమితి', బాలానంద కేంద్రాలు ఇక్కడ ఏర్పడ్డాయి. దత్తుగారి ప్రోత్సాహంతో, గబ్బిట దుర్గా ప్రసాద్ సోదరులు, ముదునూరు వెంకటేశ్వరరావు సహకారంతో. చిల్డ్రన్స్ క్లబ్ కొంతకాలం నడిచింది. రోటరీ క్లబ్ ప్రజా సేవలో ధన్యమైనది. ఇప్పుడు లయన్స్ క్లబ్ అదే బాటలో మంచి సేవలు అందిస్తోంది.పూర్వం కల్చరల్ క్లబ్ విద్యావంతులకు చక్కని సాంస్కృతిక వినోదాన్ని కలిగించింది.

ఇక్కడి క్లారినెట్ వాద్యకారులలో కాపవరపు లోకనాథం, కళ్ళేపల్లి సూర్యనారాయణ శ్రోతలను మైమరపించేవారు. గోవాడ వెంకట సుబ్బారావు ఆకాశవాణి స్టాఫ్ ఆర్టిస్ట్‌గా వుండేవారు. ఇక్కడి కవిపండితులు గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, గుండు గంగాధర శాస్త్రి, సూరి వెంకట సుబ్బయ్య ప్రతిభ అసామాన్యం. సాహితీ మండలిని 23 సం॥ల క్రితం స్థాపించిన స్వర్గీయ లంకా బసవాచారిగారు చిరస్మరణీయులు. ఇప్పుడు సాహితీ మండలి వైవిధ్యమైన కార్యక్రమాన్ని ప్రతి నెల 3వ ఆదివారం సాయంత్రం జరుపుతోంది ఎసి లైబ్రరిలో. సాహితి ప్రియులకు ఇది గొప్ప వేదిక. శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, వేమూరి కోటేశ్వరరావు, గూడపాటి కోటేశ్వరరావు వగైరా ఔత్సాహిక సహృదయుల సహకారముతో దిగ్విజయంగా నడుస్తోంది. 2009 నవంబర్ 24 న శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ అధ్యక్షులుగా 'సరసభారతి' అనే సాహిత్య, సాంస్కృతిక సంస్థ ఏర్పడింది. ఇప్పటికి ఒక సంవత్సరంలోనే 16 కార్యక్రమాలు నిర్వహించి విద్యార్థులకు, యువకులకు మహిళలకు సాహితీ సేవలందిస్తోంది. సరసభారతి 'జ్యోతిస్సంశ్లేషణం', 'మహాకవితా వసంతం', 'ఆంధ్రవేద శాస్త్రవిద్యాలంకారులు' పుస్తకాలను వెలువరించి సాహిత్యాన్ని జన సామాన్యుల దగ్గరకు చేర్చింది. ఇటీవలే ఉయ్యూరులో శ్రీ విఘ్నేశ్వరా నాటక సంస్థ వెలిసింది. పూర్వము ఇక్కడ నాటక పోటీలు జరిగాయి. కె.సి.పిలో చాలా మంది కళాకారులు ఉన్నారు. చిత్ర లేఖకులున్నారు. కూచిపూడి నాట్యానికి కేంద్రం అయ్యింది. ఉయ్యూరులో వేదాంతం శ్రీ రామాచార్యులు చాలా ఆధ్యాత్మిక గ్రంథాలు ప్రచురించారు. కురువృద్ధులు శ్రీ కె.వి.ఎస్.ఎల్. నరసింహారావు గారు సాయిభక్తి తత్పరులు. అనేక రచనలు సామాజిక పరంగా, వేదాంతపరంగా రచించిన కవి శ్రేష్టులు. ఉయ్యూరులోని రాజగారికోటలో కొంతకాలం కుస్తీపోటీలు భారీఎత్తున జరిగాయి. పేరు పొందిన పహిల్వాన్లు వచ్చి పాల్గొనేవారు. నాగభూషణం రక్తకన్నీరు నాటకం అనేక ప్రదర్శనలు ఉయ్యూరులో జరిగాయి. దసరాల్లో పులివేషాలు అర్ధనారీశ్వరవేషాలు అందర్నీ ఆకర్షించేవి. కోలాటం, భజనలు డప్పులు బాగా జరిగేవి. సంక్రాంతికి గంగిరెద్ల మేళాలు, కోయదొరలు, పిట్టలదొరలతో వూరంతా సందడే. గొబ్బెమ్మెలతో రంగవల్లులతో ప్రతి ఇల్లు సంక్రాంతి లక్ష్మీకళతో విలసిల్లుతుంది.

1953లో ఉయ్యూరులో జిల్లా గ్రంథాలయ సంస్థ శాఖను సీతంరాజు సత్యనారాయణ గారి పెంకుటింట్లో మొదట ఏర్పాటు చేశారు. సత్యనారాయణ అనే





అతను మొదటి లైబ్రేరియన్. ఇప్పుడున్న పోలీస్ స్టేషన్ ఎదురుగా పంచాయతీ గ్రంథాయలం ఉండేది. జాన్ అనే లైబ్రేరియన్ చాలా ఆసక్తిగా పుస్తకాలను యిచ్చి అందరితోచదివించేవాడు. తర్వాత దీన్ని పెద్దవంతెన దగ్గర పంచాయితీ ఆఫీసులోకి మార్చారు. ఆ తర్వాత ఎత్తేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి కళ్యాణ మండపం, ఊరవారి కళ్యాణ మండపం. కన్యకాపరమేశ్వరి కళ్యాణ మండపం, కాపులవీధి రామాలయం కళ్యాణ మండపం వివాహాలకు సభానిర్వహణకు చక్కగా ఉపయోగపడుతున్నాయి.

శ్రీ కృష్ణలీలాతరంగాలను అబ్బూరి శ్రీరాములుగారు అద్భుతంగా పాడేవారు, విష్ణాలయం, కాపులవీధి రామాలయం, శివాలయంలో ధనుర్మాసంలో రాత్రిపూట హరికథలు పోటాపోటీగాజరిగేవి. మోపర్రుదాసు, కడలివీరయ్య, ముదునూరు శంకరరావు, పొడుగు పాండురంగదాసు, పట్నాల మల్లేశ్వరరావు, కోటసచ్చిదానంద శాస్త్రి మొ॥ వారు తమ కథాగానంతో జనాన్ని మెప్పించేవారు. ఇప్పుడు ఆదరణ తగ్గింది. ఇన్ని విశిష్టతలు ఉయ్యూరులో ఉన్నాయి కనుక **'ఉర్వికి గర్వకారణం -ఉయ్యూరు'.**

అందుకనే శ్రీ గబ్బిట కృష్ణమోహన్ రచించి సరసభారతిచే ప్రచురించబడిన 'ఉయ్యూరు ఊసులు' అనే నాల్గవ పుస్తకాన్ని వినమ్రంగా, అనందంగా, బాధ్యతగా ఉయ్యూరుకు, ఉయ్యూరు పుర జనులకు అవకితం ఇచ్చి జన్మభూమి రుణం కొంతవరకు తీర్చుకుంటున్నాం.

**'ఉయ్యూరు ఊసులు'** పుస్తకాన్ని దోషరహితంగా డి.టి.పి.చేయించిన వి.జి షాప్ నిర్వాహకులు శ్రీగుంటక వేణుగోపాల్ రెడ్డికి, సహాయకులు ఆంజనేయులు, మనోజ్ కుమార్, జ్యోతి, ఫాతిమాలకు అభినందనలు. అందంగా ముద్రించిన **శ్రీ రామా గ్రాఫిక్స్, గాయిత్రీ గురుకులము** యాజమాని వేదాంతం మురళీకృష్ణకు, ముఖచిత్రాన్ని అందంగా తీర్చిదిద్దిన శ్రీ యారా సూర్యప్రకాష్ దంపతులకు ప్రత్యేక అభినందనలు.

* * *



## ఊసుకు వత్తాసు

**– గబ్బిట దుర్గాప్రసాద్**

సరసభారతి ప్రచురిస్తున్న నాల్గవ పుస్తకం మా తమ్ముడు గబ్బిట కృష్ణ మోహన్ వ్రాసిన **'ఉయ్యూరు ఊసులు'**. ఉయ్యూరు గురించిన విశేషాలు రాసిన వారెవరూ లేరు.రెండేళ్ళ క్రిందట ఉయ్యూరుకు సంబంధించి, మనతో పరిచయం వున్న వారి విశేషాలు, జ్ఞాపకం వున్నంత వరకు రాయమని దానికి **'ఉయ్యూరు ఊసులు'** అని పేరు పెట్టమని మా తమ్ముడికి చెప్పాను. వెంటనే వాడు రంగంలో దిగి, కొన్ని రాసి నాకు పంపిచాడు. బాగా వచ్చాయి. అలగే మరి కొన్ని రాయమని చెప్పాను. రాశాడు. వీటిని 'జ్ఞాపకాల దొంతర్లు' అని పిలిచాం కూడా వీటిని స్వయంగా తెలుగులో డి.టి.పి చేసి, ఒక కాపీ పంపాడు, అద్భుతం అనిపించింది. 2008 మే లో నేను నా శ్రీమతి ప్రభావతి, మా అమ్మాయి విజయలక్ష్మీ, అల్లుడు అవధానిగార్ల కోరిక, ఏర్పాట్లపై మూడవసారి అమెరికాకు వెళ్ళాం. అక్కడ మైనేని గోపాకృష్ణ గారితో పూర్వం వున్న పరిచయం గాఢమవటం, వారి ద్వారా ప్రపంచ ప్రసిద్ధ ఆర్థికవేత్త శ్రీ ఆరికపూడి ప్రేమ్‌చంద్ గారితో ఫోన్ పరిచయం జరగటం విశేషం. ప్రేమ్‌చంద్‌గారు నవంబర్‌లో ఇండియా వస్తున్నట్లు చేప్పారు, అప్పుడే ఆయనతో ఉయ్యూరులో సాహితీమండలికి ఆహ్వానించి, సన్మానిస్తామని చెప్పాను. అతి కష్టంమీద ఒప్పుకున్నారు. ఆ కార్యక్రమానికి అయ్యేఖర్చు అంతా శ్రీ గోపాలకృష్ణ గారు భరిస్తామని చెప్పారు. అలానే చేశారు. మేమిద్దరం నవంబర్‌లో ఇండియా తిరిగి వచ్చాం శ్రీ ప్రేమ్‌చంద్ గారిని ఆహ్వానించి 2008 డిసెంబర్ 21నఉయ్యూరుఎ/సి లైబ్రరీలో ఘనసన్మానం చేశాం.

ఆ సభలో మోహన్ వ్రాసిన ఉయ్యూరు ఊసులు ఫోటోస్టాట్ కాపీలను శ్రీ ప్రేమ్‌చంద్, ఎమ్.ఎల్.సి. శ్రీ వై.వి.బి. రాజేంద్రప్రసాద్ గార్ల అమృతహస్తాలతో ఆవిష్కరింపజేశాం. ఈ సభలో ఆకాశవాణి విజయవాడ కేంద్ర సంచాలకులు శ్రీ మంగళగిరి ఆదిత్యప్రసాద్, కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు, కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ జి.వి పూర్ణచంద్ మొదలగు ప్రముఖులెందరోపాల్గొన్నారు. ప్రముఖరచయిత్రి శ్రీమతి రావులపాటి సునీత, ఆపుస్తకంలోని విశేషాలను వివరించారు. శ్రీ రామినేని భాస్కరరావు, చెన్నై నుంచి వచ్చి సభకు నిండుదనం చేకూర్చారు. ఆదిత్యప్రసాద్ గారు ఊసులు చాలా బాగా వున్నాయని మెచ్చారు. శ్రీ ప్రేమ్ చంద్ కూడా ఉయ్యూరులో తన అనుబంధాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నారు, మాతమ్ముడు కృష్ణమోహన్, మరదలు సునీతలు ఆవిష్కరణకు వచ్చి ముచ్చట పడ్డారు. ఇప్పుడు ఆ





## ఉ.ఊ.ఉ..

1. **Weir** వూరు ఉయ్యూరులో-పాత కొత్త వారధుల మధ్య
   సుందరచతుర్భుజం క్రింద గలగలా ప్రవహించే జలఖండం.
   అద్భుత ప్రకృతి దృశ్యం – అందమైన పిక్చర్ స్క్వ్యా
2. చెరువు ఒడ్డున అమ్మవారు ఒంటరి – ఏడాదంతా ఖాళీ.
   మాఘపక్షంలో మాత్రం – లక్షల నయనాల నేత్రానంద దివ్యానుభూతి
3. రోడ్డుపై ఖాళీదుస్తూ తెల్లజాతి గొడ్లు
   టైరు బండ్లపై మోస్తాయి ఇక్షు ఖండాలు.
   వీటికి దవ్వ, వీడికి దంటు, వాడికి వాటం.
4. ఆరునెలలు ఆపసోపాలు–రోడ్డు మాలచ్చికి
   కదిలే చీమల్లా రోడ్డంతా రేబవలు సందడే సందడి.
5. ఎల్లెడలా ఆర్నెలలు నల్లని ధూళి వర్షం
   రాత్రంతా తెల్లని మంచు గొడుగే.
   చిక్కని తెల్లని తెర ముసుగే ఎప్పుడూ శీతువులో.

**– గబ్బిట దుర్గాప్రసాద్, 19-12-93**



ఊసులను అచ్చు ప్రతిగా తేవాలని కోరాడు తమ్ముడు, ఉయ్యూరులోనే ఆవిష్కరణ జరపాలనీ భావించాడు, అందుకు అందరం కలసి మా అబ్బాయి చి॥ రమణ చి॥ల॥సౌ॥మహేశ్వరిల వివాహ మహోత్సవ సందర్భంగా 1-12- 2010 రిసెప్షన్ రోజున ఆవిష్కరించాలని నిర్ణయించాం. ప్రముఖుల సమక్షంలో జరిగే ఈ వేడుక అందరికి ఆనందం, ఆహ్లాదం కల్గిస్తుందని సరసభారతి భావించింది.

**'ఉయ్యూరు ఊసులు'** ఉయ్యూరుకు సంబంధించిన చారిత్రక, భోగోళిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల పై రాసిన అనుభవాలు, ఇందులో తారసపడే వ్యక్తులు మహాత్ములు కాకపోవచ్చు. అయితే ఈ మట్టి మనుషులు వారంతా. వారిలో కొందరు ప్రజ్ఞావంతులున్నారు. కొందరు రాజకీయ ప్రముఖువున్నారు.మాలో సంబంధం వున్నకుటుంబాలవారున్నారు. మాసహాధ్యాయులున్నారు. మాశిష్యులూ వున్నారు. మాచిన్నితనపు చిలిపి చేష్టలున్నాయి. ఇందులో అమాయకులూ ఉన్నారు. మా జీవితాలను ప్రభావితం చేసినవారున్నారు. నిత్య జీవితంలోహాస్యం పండించిన వారున్నారు. మా ఆటలు, విద్యావ్యాసంగాలున్నాయి. మా పై ప్రేమనువర్షించిన పెద్దల గురించిన విశేషాలూ ఉన్నాయి. మాకు జాగ్రత్తలు బోధించి, మమ్మల్ని సన్మార్గంలో నడిపించిన మార్గదర్శులున్నారు. నిత్యజీవితంలోకనిపించే సామాన్యులున్నారు, వీరినెవారూ చరిత్రకెక్కించరు. వారందరికి ఈ పుస్తకంలో స్థానం కల్పించి వారిని గుర్తు చేసుకోవటమే మోహన్ చేసినపని. ఇందులో అనుభవసారం వుంది. ఆనాటి సామాజికస్థితి గతులున్నాయి. ఉయ్యూరు క్రమంగా వికసించిన విధానం వుంది, మాకు ప్రేరణనిచ్చిన మహనీయుల స్మరణవుంది. మాకు చదువుచెప్పిన ఉపాధ్యాయుల జీవిత విశేషాలున్నాయి. మా కుటుంబంలోని ప్రేమ, అనురాగం, ఆత్మీయతలున్నాయి బంధుగణంతో మా కుటుంబ సంబంధాలు కన్పిస్తాయి, మా యిళ్ళల్లో జరిగిన వివాహ, ఉపనయన వేడుకల గురించి, ఊరిలో జరిగిన ఉత్సవాలు, పెళ్ళిళ్ళు గురించి కమ్మని సంగతులున్నాయి, స్నేహంలోని మాధుర్యం, విలువ చెప్తాయి. వర్తక, వాణిజ్య విశేషాలూ మనల్ని అబ్బురపరుస్తాయి అందుకే ఈ పుస్తకం 'మిట్టీమే సోనా' లా విలువైనదనే అందరూ భావించారు. పుస్తకం ఎప్పుడు వస్తుందా అని అందరూ ఎదురు చూశారు. ఇదిగో ఇప్పుడే మీ చేతిలో ఆ బంగారం అలంకారంగా వస్తోంది. అనుభవించి, ఆనందించండి. ఇంతటి చక్కని ఊసులను ఓపిగ్గా ఊదిన మోహన్‌కు అభినందనలు, మోహన్ స్వంతఖర్చుతో ఈ పుస్తకాన్ని సరసభారతి ద్వారా ముద్రించి అందజేస్తున్నందుకు అభినందనలు. వారికుటుంబ సభ్యులు ప్రోత్సాహానికి ఆశీస్సులు. సరసభారతి ద్వారా వెలువడుతున్న ఈ పుస్తకం అందర్నీ అలరిస్తుందని భావిస్తున్నాం.





# సరసభారతీయం

**– గుంటక వేణుగోపాలరెడ్డి**

సరసభారతిని ఆదరిస్తున్న అభిమానులకు వందనాలు. సరసభారతి నిర్వహించిన 12 సమావేశాల వివరాలను. 'మహాకవితావసంతం' పుస్తకంలో మీకు అందజేశాం. తర్వాత జరిగిన కార్యక్రమాలను తెలియజేస్తున్నాను.

17-08-2010న సరసభారతి 13వ సమావేశం శ్రీ సువర్చలాంజనేయస్వామి దేవాలయంలో జరిగింది.“ తెలుగుకావ్యాలలో ఉదయాస్తమయ” వర్ణన అనే అంశంపై సభజరిగింది శ్రీ నారాయణ శ్రీనివాసమూర్తి (వసుచరిత్ర) శ్రీ పెదప్రోలు విజయసారధి (పారిజాతాపహరణం), శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి (విశ్వంభర) కావ్యాలలోని ఉదయాస్తమయ వర్ణనలపై అద్భుత ప్రసంగాలు చేసిశ్రోతలను అలరించారు. సరసభారతి అధ్యక్షులు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ అధ్యక్షతవహించి భారతం,నిరంకుశపాఖ్యానం, భీమఖండకావ్యాలలోని సూర్యచంద్రుల ఉదయస్తమయాలను వివరించారు.సరసభారతి ఉపాధ్యక్షులు శ్రీ గుంటక వేణుగోపాలరెడ్డి సభకు స్వాగతం పలుకగా, గౌరవాధ్యక్షులు శ్రీమతి జోశ్యుల శ్యామాలాదేవి సభను ప్రారంభించారు.

26-09-2010న ఏ/సి లైబ్రరిలో 14వ సమావేశంగా పుస్తకావిష్కరణ వేడుక జరిగింది. శ్రీ గబ్బిటదుర్గాప్రసాద్ వ్రాసిన 'ఆంధ్రవేదశాస్త్రవిద్యాలవకారులు', శ్రీ వికృతి ఉగాది సందర్భంగా జరిగిన 'మహకవిసమ్మేళనవ కవితా సంపుటి' 'మహాకవితా వసంతం' పుస్తకాలను ఎమ్.ఎల్.సి వై.వి.బి రాజేంద్రప్రసాద్ డా.జి.వి పూర్ణచంద్‌లు ఆవిష్కరించారు. మొదటిపుస్తకాన్ని డా.వి.వి.భానుమూర్తి, రెండవ దానిని శ్రీవసుధ, శ్రీ తుమ్మెజురామ లక్ష్మణాచార్యులు సమీక్షించారు. ఉయ్యూరు ఎజి. & ఎస్.జి సిద్ధార్ధ డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ బి.వి రాయుడు అధ్యక్షతవహించాగా, శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి సభాప్రారంభింపచేశారు. “ఆంధ్రవేద శాస్త్రవిద్యాలంకారులు” గ్రంథాన్ని కీ॥శే॥ కోమలి సూర్యనారాయణ శాస్త్రిగారికి 'మహకవితా వసంతం పుస్తకాన్ని' ప్రముఖ సాహితీ విమర్శకుడు స్వర్గీయ టి.ఎల్ కాంతారావుకు అంకితం చేశాము. శాస్త్రి మెమోరియల్‌ట్రస్ట్ సంస్థాపకుడు, ప్రముఖ ఆర్కిటెక్ట్ కోమలి సాంబావధాని అమెరికా నుంచి ప్రత్యేకంగా వచ్చి కార్యక్రమంలో పాల్గొని, నిండుదనం తెచ్చారు. అధ్యక్షులు శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ ఆహ్వానం పలికి, సభాపర్యవేక్షణ చేశారు.

26-10-2010న 15వ సమావేశం శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయంలోని మహితమందిరంలో జరిగింది. శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి రచించిన 'నవయుగానికి నవ్యకవిత – చిటికె సాహిత్యం' పై శ్రీమాదిరాజు శ్రీనివాసశర్మ అద్భుతంగా ప్రసంగించి, సభారంజనం చేశారు. ఉయ్యూరు ఎజి. & ఎస్.జి సిద్ధార్ధ డిగ్రీ కళాశాలపౌరనీతిశాస్త్రాధిపతి శ్రీ పి.నారాయణమూర్తి అధ్యక్షతవహించి నిండుదనం తెచ్చారు. శ్రీమతి శ్యామలాదేవి, దుర్గాప్రసాద్ సభానిర్వహణ చేశారు. కార్యదర్శి శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి వందన సమర్పణ చేశారు.

23-11-10న 16వ సమావేశం శ్రీ సువర్చ లాంజ నేయస్వామి దేవాలయంలో జరిగింది. కార్తీకమాసం సందర్భంగా 'శ్రీనాధుని కవిత్వంలో శ్రీ శివతత్వం' ప్రసంగాన్ని ఏర్పాటు చేశాం. శ్రీ యల్లాప్రగడ వెంకటరామ రాజు (తెలుగు పండితులు – కె.కె.అర్ గౌతం కాన్సెప్ట్ స్కూల్ – గుంటూరు) శ్రావ్యమైన కంఠంతో అద్భుతమైన శైలిలో శ్రీనాధుని పద్య మకరందాన్ని భక్తజనులకు అందించారు. కవి సార్వ భౌముడు ఆవిష్కరించిన శ్రీ శివతత్వాన్ని మనోహరంగా వివరించారు. శ్రీ చిత్తజల్లు భవనీ శంకరరావు అధ్యక్షత వహించగా శ్రీ గుంటక వేణుగోపాల రెడ్డి సభా నిర్వహణ చేశారు. శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి సభా ప్రారంభం చేశారు. శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ పర్య వేక్షించారు. శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి వందనసమర్పణ చేశారు.

2009 నవంబర్‌లో ప్రారంభింపబడిన 'సరసభారతి' ఒక్క సంవత్సరంలోనే 16 సభలను నిర్వహించి మూడు పుస్తకాలను ఆవిష్కరించి ఒక మహాకవి సమ్మేళనాన్ని నిర్వహించి మూడు సంగీత కార్యక్రమాలను జరిపి అందర్ని ఆశ్చర్యపరచి అభిమానులుగా మార్చి సాహితీ సేవలో తన వంతు కర్తవ్యం నేరవేర్చింది.





## ఉయ్యూరు - ఉయ్యూరా ? ఫుయ్యూరా ?

ఎంతోమంది ప్రతిభావంతులు వాళ్ళు పుట్టి పెరిగిన వూళ్ళ పేరుతో అక్కడి జనావళి గురించి, ఒకనాటి జనజీవన విధానం గురించి కథలు రాశారు – దర్గామిట్ట కతలు, మిట్టూరోడి కతలు, అమరావతి కథలు, మా పసలపూడి కథలు (వీటిని గుత్తిగా – నాలుగు క్షేత్ర కథానికలు అన్న పేరుతో వాటి వైశిష్ట్యాన్ని శ్రీ ఎమ్బీయస్ ప్రసాద్ సమీక్షిస్తూ హాసం ప్రచురణల్లో భాగంగా ప్రచురించి కొనియాడారు), జడ్జి 'జింబో' రాజేందర్ గారి వేములవాడ కథలు, భట్టిప్రోలు కథలు మొదలైనవి ఆ కోవకి చెందినవే. వాళ్లకి ప్రతిభ వుంది, భాషా పటుత్వం వుంది. సమాజంలో అన్ని వర్గాలతోనూ సంబంధం వుండటం వల్ల అందరి గురించి చిన్నా పెద్దా తేడా లేకుండా రచించి మెప్పు పొందారు, పొందుతున్నారు. అయితే నేను పుట్టి పెరిగిన, నాకు తెలిసిన ఉయ్యూరు, పరిచయం వున్న వ్యక్తులు కనీసం యాభయి సంవత్సరాలు కిందటి వారు. పైగా లిమిటెడ్ సర్కిల్. అయినా ఆ గ్రామానికి చెందిన కొంతమంది విశిష్ట వ్యక్తుల వల్ల కొన్ని సంఘటనల వల్ల మాతరం వాళ్ళలో కొందరం ప్రభావితం చెందాము. అయితే యిదేదో అనధికారిక దస్తావేజులా అవుతుందేమోనని కొంతకాలం పాటు ఆ ప్రయత్నాన్ని వాయిదా వేస్తూ వచ్చాను. అందులోను ఎంతమందికి దీనిలో కుతూహలం వుంటుందనే ప్రశ్న కూడా కలిగింది. అయినా చూద్దామని యిప్పుడు మొదలెట్టాను.

యాభయి సంవత్సరాల కిందటి ఉయ్యూరు అనగానే ముందుగా గుర్తుకొచ్చేవి – పుల్లేరు కాలువ, కె.సి.పి. లిమిటెడ్ వారి పంచదార మిల్లు, పాలిటెక్నిక్ కాలేజి, వీరమ్మ గుడి, గుడి దగ్గర కలువపూలు, తామరపూలతో నిండిన చెరువు ( ఈ చెరువు ఉయ్యూరుకి పొలిమేర, ఆతరువాత గండిగుంట అనే పల్లెటూరు. పాండురంగ మహాత్యం సినిమాలో మొదట ఎన్.టి. రామారావు పాటపాడుతూ గుర్రం మీద స్వారీ చేస్తూ వెడుతున్నప్పుడు కొన్ని సెకండ్లపాటు వొట్టి యీ చెరువును చూపిస్తారు. నిమ్మకూరు నుండి విజయవాడకి తిరిగి వెడుతుంటే దారిలో వున్న ఆ చెరువు సౌందర్యానికి ముగ్ధుడై ఆ చిన్న షాటు తీసి సినిమాలో పెట్టించారట ఎన్టీఆర్) వగైరాలు. అంతేనా ?అంతేనా అంటే మరి అంతే కాదండోయ్. చక్కగా తీర్చిదిద్దినట్టు గట్టులు కట్టుండే వేలకొద్దీ ఎకరాల సస్యశ్యామలమైన పంటచేల మధ్యగా తాచుపాములాంటి నల్లటి తారురోడ్డు; రోడ్డు పక్కన ఎత్తుగా పెరిగిన చింత, మర్రి, రావి చెట్లు; కనుచూపు మేర వరకూ

చెరకు తోటలు, వరి పొలాలు; తమలపాకు, దొండ, పసుపు తోటలు, కొబ్బరి చెట్లు, తాడి చెట్లు – ఒక రమణీయమైన దృశ్యంగా కనిపిస్తుంది ఈరోజుకి కూడా. ఊరికి దక్షిణంగా ప్రవహిస్తుండే పుల్లేటి కాలువ మీద సి.బి.యం. ఆసుపత్రి దగ్గర పెద్ద వంతెన, యాకమూరు వైపు చిన్న వంతెన వగైరాలు. చిన్న వంతెన సైకిళ్ళకీ, నడకకీ మాత్రమే ఉపయోగం. శివాలయం వీధి నుంచి కాలువగట్టు మీదుగా చిన్న వంతెన వైపు నడుస్తుంటే కంటి ముందు సుమనోహర దృశ్యం – కాలవకి అవతల తోట్లవల్లూరు వెళ్ళే రోడ్డుకి రెండు వైపులా విరబూసిన పూలతో ఎత్తుగా నిద్రగన్నేరు చెట్లు, గానుగ చెట్లు నీడనిచ్చి ప్రయాణీకుల బడలిక తీరుస్తూ మౌనంగా తలలు వూపుతూ వుంటాయి. అన్ని రుతువుల్లోనూ – అప్పటికీ, యిప్పటికీ. అప్పుడు – 'అశోకుడు రోడ్లకు యిరువైపులా చెట్లు నాటించెను' అని చిన్నప్పుడు పుస్తకాల్లో చదివింది గుర్తుకొస్తుంది. ఉయ్యూరు పాలిటెక్నిక్ కాలేజీలో ఒకాయన, '*బెజవాడ బందరు బంగారు రోడ్డుపై వెలసిల్లె ఉయ్యూరు వేద్కతోడ ...*' అంటూ పాటకట్టి పాడటం గుర్తుంది.

ఆ తరువాత వచ్చే ప్రశ్న ఉయ్యూరు – ఉయ్యూరా లేక వుయ్యూరా అని. ఇంగ్లీషులో అయితే మొదటినించి **Vuyyuru** అనే రాస్తుండేవాళ్ళు. తెలుగులోకి వచ్చేసరికే ఈ మీమాంస వుండేది. నామవాచకాలకి అచ్చులే వుపయోగించాలి, హల్లులు కాదు అని చిన్నప్పుడు అందరం నేర్చుకున్నా, రెండు విధాలుగానూ రాస్తూండేవాళ్లం. మరి యిలాంటి సందేహాన్ని తీర్చగల పండితుడు ఎవరు ? ఆయనే మా నాన్నగారైన విద్వాన్ గబ్బిట మత్యుంజయ శాస్త్రిగారు. మరి ఆయన పరిష్కరించగలిగారా వన్స్ ఫరాల్ ? అదో తమషా ముచ్చట. చెబుతా వినండి మరి.

ఆరోజుల్లో విష్ణాలయం (దీన్ని కూడా విష్ణ్వాలయం అని రాయాల్ట) వీధిలో కాపురముండే ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు గారికి మా సినిమా హాలుకి యివతలగా ప్రింటింగ్ ప్రెస్ వుండేది. దాని పేరు ఉమా ప్రెస్. ఏ సినిమా హాలు అని అడగకండి, ఒకటే ఒకటి. ఏడు మైళ్ల దూరంలో వున్న కంకిపాడు వరకూ యిటు ఎనిమిది మైళ్ల దూరంలో వున్న పామర్రు వరకూ; అటు కాటూరు, యిటు తోట్లవల్లూరు వరకూ మరో సినిమా హాలు లేదు. శ్రీ ఏకాంబరేశ్వర పిక్చర్ ప్యాలెస్. అది రామినేని బుచ్చిబాబు గారనే సంపన్నుడికి చెందింది. ఆయన పెద్ద కొడుకు పేరు ఏకాంబరేశ్వరరావు. (ఇప్పుడది లక్ష్మీటాకీస్‌గా చెలామణి అవుతోంది). రోజూ రెండాటలు, ఆదివారంనాడు,





పండగలకి మూడు ఆటలు ఆడేవి ఆరోజుల్లో. మొదటి ఆట బాగా ఏడూ, ఏడున్నరకి కానీ మొదలయ్యేది కాదు. పొలం పనులు ముగించుకుని తీరిగ్గా వచ్చేవారికి సదుపాయంగా వుండేదది. తమిళంలో ఎం.జి. రామచంద్రన్, భానుమతి నటించిన నాడోడి మణ్ణన్‌కి తెలుగు డబ్బింగు అనగా అనగా ఒకరాజు అనే దాదాపు నాలుగు గంటల నిడివి వున్న సినిమా రెండో ఆట పూర్తయేసరికి తెల్లవారుజామున మూడు, మూడున్నర అయ్యేది (క్లైమాక్సులో యమ్జీఆర్, నంబియార్ల ఎడతెగని కత్తియుద్ధం పంచరంగుల్లో వుండటం ప్రత్యేక ఆకర్షణ). సినిమా హాలుకి ఎదురుగుండా వున్న సబ్ రిజిస్ట్రార్ ఆఫీసు వెనుక ఖాళీ స్థలంలో కూచుని సినిమా మొదలయ్యే ముందు వేసే గ్రామఫోను రికార్డు పాటలు వింటూ కాలక్షేపం చేయ్యటం ఒకప్పుడు చాలామందికి హాబీ, మాతో సహా.

ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు గారికి కొంత పొలం, యిళ్ళూ, స్థలాలూ వున్నాయి. వేన్నీళ్ళకి చన్నీళ్ళుగా, వ్యాపకంగా ఉమా ప్రెస్‌ని నడుపుతుండే వారు – ముఖ్యంగా శుభలేఖలు, ఎన్నికల కరపత్రాలు, అప్పుడప్పుడు సన్మాన పత్రాలు – వూళ్ళోవీ, పక్కనున్న అన్ని గ్రామాల్లోవీ ముద్రిస్తుండేవారు. మేటరంతా అయిన తరువాత దిగువన అంచులో వుమా ప్రెస్, వుయ్యూరు అని చిన్న ప్రింటులో వేస్తుండేవారు. మృత్యుంజయ శాస్త్రి గారు హల్లులు వద్దు, అచ్చులు వాడండి అని ఒకటి రెండుసార్లు ఆయనతో అన్నారు. మార్పు కనబడకపోవడంతో ఓసారి నాతో, 'నువ్వెళ్ళి ఆయనతో నేను మళ్ళీ చెప్పానని చెప్పరా' అని కరెక్టు చేసిన శుభలేఖని (ఇంతకీ అది ఎవరో పెళ్ళి పిలుపుగా యిచ్చిన కార్డు) నా చేతికిచ్చి పంపించారు. చంద్రమౌళీశ్వరరావు గారు కొంచెం సీరియస్‌గా కనబడుతారు. ఆ కార్డు తీసుకుని నాకు ఆ మాత్రం తెలియదనుకున్నారా అన్నట్టు లావుపాటి కళ్ళద్దాల్లోంచి నావైపు చూసి మాట్లాడకుండా నన్ను పంపించేశారు.

ఆ తరువాత యింటికి ఎవరన్నా శుభలేఖ యిస్తే వూరి పేరు, ప్రెస్సు పేరు యిప్పుడెలా ప్రింటు చేస్తున్నారో అని శ్రద్ధగా గమనిస్తుండే వాడిని. మొదట్లో ఉమా ప్రెస్, ఉయ్యూరు అని వచ్చినా ఆ తరువాత ఎందుకొచ్చిన గోల యిది అనుకున్నట్టు ఒకసారి ఉమా ప్రెస్ వుయ్యూరు అనీ, మరొసారి వుమా ప్రెస్ అని రకరకాల కాంబినేషన్లతో ప్రింటవుతుండేవి. ఉమా ప్రెస్ ఎప్పుడో నిలిచిపోయింది. మరి ఇంతకీ మాది ఉయ్యూరా ? వుయ్యూరా ? అన్న ప్రశ్న మాత్రం మిగిలిపోయింది. అందుకే

నాకూ మరి ఉయ్యూరు ఊసులు లేదా వుయ్యూరు వూసులు లేదా ఉయ్యూరు వూసులు లేదా వుయ్యూరు ఊసులు – యిన్ని రకాల కాంబినేషన్స్ దొరికాయి.

మా వూరి పేరు గురించిన మరో విశేషం యిక్కడ చెప్పాలి. వేసవి సెలవల్లోనూ, కాలేజీ చదువు పూర్తి అయిన తరువాతా మా అందరి అలవాటు – రోజు పొద్దున తొమ్మిదిన్నరా పది కల్లా పోస్టాఫీసుకి వెళ్ళడం. తపాల బస్సు (టాపు మీద చిన్నగా ఎఱ్ఱ రంగులో షెడ్డు ఆకారంలో వున్న పెట్టె మీద మెయిల్ బస్ అని రాసుండేది, మద్రాసు నుంచి హౌరా వెళ్ళే మెయిలు బండి లేటయితే ఈ బస్సు కూడా లేటే) విజయవాడ నించి పొద్దున ఎనిమిదింటికి మెయిన్‌రోడ్డు మీద టపా సంచులు తీసుకొస్తే పోస్ట్‌మేన్ వాటిని బస్సుమీద నించి దింపుకుని పోస్టాఫీసుకి మోసుకెళ్ళేవాడు. అప్పుడది శివాలయం పక్కన పెంకుటింట్లో వుంటుండేది. ఊరికి మొత్తం యిద్దరే పోస్టుమేన్లు వుండటంతో వుత్తరాలు మధ్యాహ్నం మూడు దాటిన తరువాత కాని యింటికి తెచ్చి యిస్తుండేవారు కాదు. అందుకని మేము కొంతమందిమి అక్కడికే వెళ్లి తెచ్చుకునే వాళ్ళం. మాతోబాటు రోజూ అక్కడికి కాలవ అవతలనించి సైకిలు మీద ఒకాయన వొస్తుండేవారు. ఆయన అసలు పేరేమిటో మాకప్పుడు తెలియదు. కాని గోపాలరావు గారబ్బాయనే తెలుసు. ఇంతకీ గోపాలరావు గారబ్బాయంటే ఏదో చిన్నపిల్లాడను కుంటారేమో నలభై ఏళ్ల పైచిలుకే. అయినా తండ్రి బతికుండగా స్వంత పేరుతో ఎప్పుడూ చలామణి కాకపోవటం పల్లెటూరి ప్రత్యేకత, స్వభావం. కె.సి.పి. వారి కాలనీ, ఆ తరువాత వి.ఆర్.కె.యమ్ స్కూలూ కాలవ అవతల తోట్లవల్లూరు రోడ్డులో రాకముందు పంటచేల మధ్యలో గోపాలరావుగారి యిల్లు ఒక్కటే వుండేది. పోస్టాఫీసులో ఒకసారి రంగయ్య అనే పోస్టుమేన్‌కి సాయం కావాల్సి వచ్చింది. అతనికి కొంచెం నత్తి. బట్వాడా చెయ్యవలసిన కార్డుని పట్టుకొచ్చి, 'మ్మి ... మ్మి ... మీకు తెలుసా ఎవరో యీన' అంటూ అందించి అడిగాడు. అడ్రసులో యిలా రాసుంది – శ్రీ వుయ్యూరు వుయ్యూరు గార్కి, వుయ్యూరు పోస్టు, కృష్ణాజిల్లా ! ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు గారు గుర్తుకొచ్చారా ?

* * *





## ఉయ్యూరు వీరమ్మ తల్లి

ఉయ్యూరు గ్రామానికి పడమటి దిక్కున పొలిమేర – వీరమ్మ గుడి. పిల్లి మాణిక్యం గారి అడితీ (ఇప్పుడు వెంకటేశ్వర టాకీస్) దాటి కొంచెం ముందుకు వెడితే ఎడమవైపున చెరువు, చెరువు గట్టున వీరమ్మ గుడి కనిపిస్తాయి. సంవత్సరంలో పదకొండున్నర నెలలపాటు అక్కడేమీ హడావిడి వుండదు. అది వీరమ్మ తల్లి పుట్టిల్లని, భర్త చింతయ్య మరణించిన తరువాత ఆ చితిలో దూకి యిక్కడే సహ గమనం చేసిందని చెబుతారు. సహగమనానికి ముందు వొంటికీ, మొహానికీ పసుపు రాసుకోడానికని పుసుపు కొమ్ములు దంచుకుంటుంటే ఆ రోలు పగిలిందనీ, పగిలిన రోలుకి తన కుడిపాదాన్ని అడ్డుపెట్టి పసుపు దంచటం ముగించిందనీ, ఆ రోలు యింకా యిక్కడే వుందనీ నిలువుగా పగిలిన ఒక రాతి రోలుని చూపిస్తుండేవారు. పదకొండున్నర నెలలు గొల్లల బజారులో (చిన్న మసీదుకు పక్కగా, ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు గారి యిల్లు దాటి పక్క సందులోకి వెళ్లాలి) వీరమ్మ విగ్రహం, పక్కనే భర్త చింతయ్య విగ్రహం ఒక యింట్లో పల్లకీలో వుంచుతారు. అది ఆవిడ అత్తవారిల్లని చెబుతారు. సంవత్సరంలో పదిహేను రోజులపాటు పుట్టింటికి – పొలిమేర దగ్గరున్న గుడికి – మాఘశుద్ధ ఏకాదశి నాడు విగ్రహాలని పల్లకీలో వూరేగిస్తూ తీసుకెడతారు. కొమ్ములు వూదటం, దివిటీలు వెలిగించటం, దారిలో ప్రతి గుమ్మం ముందు పల్లకీని నిలబెడితే యింటివారు మెరుగ్గా తోమిన యిత్తడి చెంబుతోనో, బిందెతోనో పారణ నీళ్ళు పోయటం, కొబ్బరికాయ కొట్టించటం, మంగళ హారతులివ్వటం జరుగుతూ కొన్ని బజార్లు తిరిగిన తరువాత శివారులో చెరువుగట్టునున్న గుడికి అత్యంత వైభవంగా తీసుకెడతారు. దారిలో మెయిన్‌రోడ్డు (బెజవాడ–బందరు హైవే) మీదున్న వుయ్యాల బల్లమీద ఆ విగ్రహాలని వుంచి వుయ్యాల వూగిస్తారు. ఆ వుయ్యాలకి వున్న తనాబి మీద – తనాబి పిల్లి మాణిక్యం గారి ధర్మం అని చెక్కి వుండేది. ఆ తరువాత గుడికి తీసుకెడతారు. పదిహేను రోజులపాటు బహుళ ఏకాదశి వరకు అక్కడే వుంచి తిరణాల జరుపుతారు. భక్తులు – ముఖ్యంగా స్త్రీలు – మొక్కు తీర్చుకోడానికి చెరువులో స్నానాలు చేశొచ్చి తడి బట్టలతో అంగప్రదక్షిణ చేస్తారు. ఇలా పదిహేను రోజులు కుల మత భేదాలు లేకుండా జనం తొక్కిసలాడుతూ వుంటారు. ఎక్కడెక్కడి నించో బళ్ళు కట్టుకునొచ్చిన జనం గ్రామదేవతలకి యిచ్చినట్టు బలులు యిచ్చి మొక్కుబడులు తీర్చుకుంటారు.

తొమ్మిదో రోజున సిడిబండి వూరేగింపు వుంటుంది. ఈ బండికి చక్రాలు మాత్రం పాతవే వుపయోగిస్తారు కాని మిగిలిన భాగం అప్పుడే నరికి తెచ్చిన పొడుగాటి తాడి దుంగని వాడతారు. శివాలయం వీధిలో యిప్పుడు వాటర్ ట్యాంక్ వున్న ప్రదేశంలో బ్రహ్మం అనే కమ్మరి కొలిమి పెట్టుకుని వుంటుండేవాడు. ఆ కొలిమి దగ్గర చక్రాల్ని, తాడి దుంగని పడేస్తే దుంగకి వున్న నల్లటి పై చెక్కుని నిలువుగా బాడితతో చెక్కి తీరుబడిగా సిడిబండిని తయారు చేసేవాడతను. ఆ పొడుగాటి తాడికి పసుపు కుంకమలు అద్ది కొనకి బుట్ట కట్టి దాంట్లో ఆ సంవత్సరపు పోతరాజుని– గూడెం నుంచి ఎన్నికైన దళితుల కుర్రవాడిని కూర్చోపెట్టి వేలాడుతున్న ఆ బుట్ట వైపుకి జనం అరటిపళ్లు విసురుతుంటే వూరేగింపుగా బండిని లాగుతూ తీసుకెడతారు.

హైస్కూల్లో చదువుకుంటుండే పిల్లలందరికీ ఆ పదిహేను రోజులూ పండగలా, ఆటవిడుపులా వుండేది. తిరుణాల జరిగే ప్రదేశం హైస్కూలుకి చాలా దగ్గర, వీలైనప్పుడలా వెడుతుండే వాళ్లం. ఆ రోజుల్లో ముఖ్యమైన ఆకర్షణ ఎత్తుగా చెక్కల్లో గుండ్రంగా వెడల్పుగా బావిలా కట్టిన దాంట్లో లోపలివైపు సైకిల్ని, మోటారు సైకిల్ని చుట్టూ స్పీడుగా కిందనించి మీదికి నడుపుతూ గింగిరాలు తిరుగుతుంటే వొద్దున నుంచుని మేమంతా అబ్బురంగా ఎంత గొప్పగా బ్యాలెన్సు చేస్తూ నడుపుతున్నారో అని మురిసిపోతుండేవాళ్ళం. మోటారు సైకిలు తిప్పుతుంటే ఆ చెక్కలు చేసే శబ్దానికి భయం కూడా వేసేది. తరువాత రంగులరాట్నం. ఇప్పటిలా మోటరుతో నడిచేవి కాకుండా యిద్దరు మనుషులు చెరో వైపునా నుంచుని హ్యాండిల్సు పట్టుకుని చేత్తో తిప్పేవారు. రామచిలక ఫిరంగి పేల్చటం మరో ఆకర్షణగా వుండేది.

వూళ్ళో ఆడవాళ్ళు కూడా ఏవైనా వస్తువులు కొనుక్కోవాలంటే తిరణాల వొస్తుందిగా అప్పుడు కొనచ్చులే అని తిరణాల కోసం నిరీక్షిస్తుండేవారు. ఇప్పటిక్కూడా ఎన్నెన్నో వూళ్లు చుట్టపెట్టి తిరిగొస్తుంటే ఉయ్యూరు పొలిమేరలో వీరమ్మ గుడి కనిపించగానే ఒక రకమైన వుత్సాహం, వుద్వేగానికి లోనవుతుండటం – జననీ జన్మ భూమిశ్చ ....

* * *





## ఓ దానికేం, మినరల్ వాటరుందిగా !

విఖ్యాత సినీ రచయిత డి.వి. నరసరాజు తన జీవిత చరిత్రని అదృష్టవంతుడి ఆత్మకథ అన్న పేరుతో విడుదల చేశారని చదివి, వెంటనే విశాలాంధ్ర వారి షాపుకెళ్ళి కొనుక్కుని గబగబా చదివేశా ఆమధ్య. ముందుమాటలో ఆయన చెప్పుకున్న ప్రకారం వృద్ధాప్యం వల్ల రాయటం కష్టమవటంతో టేప్ రికార్డరులో డిక్టేట్ చేశారట దాన్ని. అయితే దాన్ని ఎడిట్ చెయ్యకుండా వున్నదున్నట్టు ముద్రించటంతో కొన్ని సంగతులు చాలాసార్లు రిపీటయినా, సులభంగా లభ్యంకాని ఫోటోలూ, సినిమా రంగంలోని వారందరితో ఆయనకున్న సాంగత్యం వల్ల ఎంతోమంది సినిమా ప్రముఖులు – నిర్మాతలు, దర్శకులు, నటీనటులు ఒకరేమిటి అందరి గురించీ వున్నాయందులో. అందులో గ్లేరింగ్‌గా నాకు కనబడింది – వెంపటి సదాశివబ్రహ్మంగారి పేరు ఎక్కడా మచ్చుకైనా లేకపోవటం. ఆ రోజుల్లో సినిమా బాక్సాఫీసు హిట్టవాలంటే కథనో, మాటలో, స్క్రీన్ ప్లే నో ఏదో ఒకదానికి తప్పకుండా వెంపటి సదాశివబ్రహ్మం గారి చలవ వుండవలసిందే. అలాంటి ప్రముఖ వ్యక్తిని గురించి ఎందుకు రాయలేదా అని ఆయనకి వుత్తరం రాసి కనుక్కుందామని పబ్లిషర్ని అడ్రసు అడిగితే కేరాఫ్ మా పేరుతో రాయండి, మేము అందచేస్తాం అన్నారు. ఆపనే చేశా. అది ఆయనకి చేరేలోపలే నిర్యాణం చెందారాయన. దాంతో ఆ ప్రశ్న ప్రశ్నగానే మిగిలింది.

అసలింతకీ యీ భాగోతం ఏమిటయ్యా అనుకునే వాళ్ళు ఒక్క నిమిషం ఆగండి. నరసరాజు గారు ఉయ్యూరు రాజావారితోనూ, చెన్నపట్నంలో మకాముంటున్న రాజావారి కుటుంబీకులతోనూ తనకున్న సంబంధాన్ని, రాజావారి త్యాగనిరతిని, అవ్యాజమైన అనురాగాన్ని ఆ పుస్తకంలో రెండు మూడు చోట్ల తెలిపారు. ఇంతకీ ఉయ్యూరు రాజాగారెవరు అన్న ప్రశ్నకి సమాధానం – శివాలయంలో ముఖద్వారానికి పైన ఎత్తులో వున్న ఆయన బొమ్మ. ఇంకా విజయవాడలో యస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్ కాలేజీతో పరిచయమున్న వాళ్ళకి ఆ కాలేజి లోపల గేటుకి ఎదురుగా ఠీవిగా గుర్రాన్ని పట్టుకుని నిలబడ్డ రాజావారి నిలువెత్తు బొమ్మ కనిపిస్తుంది. ఆయన పేరే ఆ కాలేజీలో సగభాగం – శ్రీ రాజా రంగయ్యప్పారావుగారు, యింటి పేరు మేకా వారు. మిగిలిన సగభాగం – చుండూరు వెంకటరెడ్డి గారు. మా తరం వాళ్ళం రాజా రంగయ్యప్పారావు గారి పేరు వినడమే గాని ఎప్పుడూ ఆయన్ని చూడలేదు. అసలు,

వాళ్ళెవరూ ఉయ్యూరులో వుండేవారు కాదు. నూజివీడు కోటలోనో మద్రాసులోనో వుండేవారు. నూజివీడు సంస్థానం కూడా వారి వంశానికి చెందినదే.

మా వూళ్ళో పేరుకి చిన్న కోట (దాన్ని రాజావారి నించి వెంట్రప్రగడ బ్రహ్మంగారు కొన్నారు), పెద్ద పశువుల దొడ్డి (రాజావారి ఏనుగుల్ని, గుర్రాల్ని అక్కడ కట్టేసేవారట, దాన్ని వెంట్రప్రగడ వెంకటరత్నం కొన్నారు, అందులోనే ముందు ఎలిమెంటరీ స్కూలు నడిచేది), ఠాణా (దీన్ని పూరావారు కొన్నారు) వుండేవి. ఈ కొన్న వాళ్లందరూ వైశ్యులవటం అప్పుడు వారికున్న ఆర్ధిక స్తోమతని సూచిస్తుంది బహుశా. రాజావారి కోట అప్పటికీ యిప్పటికీ ఏమాత్రం మార్పుచెందలేదు. గెస్ట్‌హౌస్‌ల్లాంటి విడివిడిగా వుండే పెంకుటిళ్ళు, విశాలమైన ఆవరణ, దాంట్లో ఎత్తుగా కొబ్బరిచెట్లు అలానే వుండిపోయాయి. ఆ ఆవరణ చుట్టూ ఎత్తుగా వున్న ప్రహరీ గోడ దాకా చెక్కలతో గ్యాలరీలాంటి స్టేడియంని ఏర్పాటు చేసి ఒకప్పుడు కుస్తీ పోటీలు నడిపారు, టిక్కెట్టు పెట్టి.

ఈ కుస్తీ పోటీలు పరిచయం చెయ్యడం వెంట్రప్రగడ బ్రహ్మంగారి చలవే. కాలేజి మైదానంలో పెడగా ఆయనకున్న స్థలంలో రెండుపాకలు వేసి వాటిల్లో పంజాబు నుంచి యిద్దరు పహిల్వాన్లని తెచ్చి వుంచారాయన. లంగోటీలు కట్టుకుని వాళ్లిదరూ వొంటికి నూనె పులుముకుని తొడలు కొడుతూ, ఎడమ చెయ్యి మడిచి కుడి బుజం దగ్గర పెట్టి ఠాప్ ఠాప్ మని చప్పుడొచ్చేటట్టు కుడిచేత్తో జబ్బల మీద చరుస్తూ రోజూ పొద్దునా సాయంత్రం పాకల ముందున్న మట్టి గోదాంలో ప్రాక్టీస్ చేసుకుంటుంటే చూసి మాక్కూడా మోజు కలిగేది. ఆకలేసి వాళ్ళు లోపలికెళ్ళి పొడుగాటి గ్లాసునిండా వున్న పాలల్లో కోడిగుడ్డు కొట్టి కలుపుకుని తాగుతుంటే కొంతమంది పిల్లలు గోచీలు పెట్టుకుని ఆ వస్తాదుల్ని (వస్తాదు, పహిల్వాను అనే మాటలు అప్పుడే పరిచయం మాకు) అనుకరిస్తూ ఆ మైదానంలో కుస్తీ పట్లు నేర్చుకునేవారు. పైగా కింగ్‌కాంగ్ – దారాసింగ్‌ల ఫ్రీ స్టయిల్ రెజ్లింగ్ పోటీలు ముమ్మురంగా జరుగుతుండేవి ఆ రోజుల్లో.

రాజా రంగయ్యప్పారావు గారి కుమారుడు – రాజా వేంకటాద్రి అప్పారావు గారు. వారి కుమారుడికి రంగయ్యప్పారావు గారి పేరే పెట్టినా ఆయన – యమ్.ఆర్. అప్పారావు, ఎం.ఏ గా ప్రసిద్ధులు; కుమారరాజా అంటుండేవారు. విద్వాంసులు. గోవాలో పోర్చుగీసుల తుపాకులకి బలి అయిన సూరి రామం ( సూరి శోభనాచలపతి గారి





కుమారుడు) శిలా విగ్రహాన్ని ఆవిష్కరించేందుకు ఆయన ఉయ్యూరు వచ్చారు. ఆ తరువాత ఎం.ఎల్.ఏగా నూజివీడు నించి ఎన్నికై మంత్రిగా కొంతకాలం, ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలనర్‌గా కూడా కొంతకాలం వున్నారు. శ్రీ యమ్.ఆర్. అప్పారావు కుమారరాజాగానే వుండిపోయారు చివరివరకూ. ఎందుకంటే యీలోపల జమీందారీ వ్యవస్థ అంతరించటం; ఇందిరాగాంధీ రాజభరణాలు, రాజుల వ్యవస్థని రద్దు చేయ్యటం జరిగింది.

అంతా బావుందయ్యా, మరి నరసరాజుగారు ఏం చెప్పారయ్యా బాబూ అని అడగబోతున్నారని నాకు తెలుసండీ. మేకా వారిది ఎంత గొప్ప వంశమో, వారు ఎంత గొప్ప విద్యావంతులో చెప్పి ఆ తురువాత ఆయన వెలిబుచ్చిన రాజావారి వుదార స్వభావం నాలో ముద్రవేసుకుంది. నరసరాజు గారి ప్రకారం – చాలాకాలం కిందట ఒకసారి వరుసగా వానలు కురవక కరువు కాటకాలతో ఉయ్యూరు జమీందారిలో వున్న రైతులందరూ దెబ్బతిన్నారట. అయితే పంటలు పండినా పండకపోయినా రాజావారికి శిస్తులు, పన్నులు చెల్లించాలిగా మరి. తిండి దొరక్క యిబ్బంది పడుతున్న రైతులకి పన్నులు చెల్లించే పరిస్థితి లేక ఏం చేయాలో పాలుపోలేదట. కొంతమంది రైతులు ధైర్యం కూడగట్టుకుని తమ యిబ్బందుల్ని రాజావారికే స్వయంగా విన్నవిద్దామని చేతిలో ఎర్రని ఏగానీ లేక ఉయ్యూరు నించి నూజివీడు దాకా (నలభై మైళ్ళ పైచిలుకు) నడిచి వెళ్లారట. కోటలో ప్రవేశించిన తరువాత దివానుగారితో తమ గోడు వెళ్లబోసుకుంటే ఆయన కస్సుమని లేచి బకాయిలన్నీ కట్టాల్సిందేననీ, రాజావారిని కలవటానికి వీల్లేదనీ చెప్పారట.

దిక్కుతెలియని రైతులు బిక్కమొహాలతో నుంచునుంటే రాజా రంగయ్యప్పారావు గారికి యీ వర్తమానం చేరిందట. వెంటనే ఆ రైతుల్ని తమ సముఖానికి పిలిపించి వాళ్లు అనుభవిస్తున్న కష్టాల్ని సహృదయంతో అర్ధం చేసుకుని అక్కడిక్కడే బకాయిలు తక్షణం రద్దు చేయించారట. అంతేనా అనుకుంటున్నారు కదూ, ఆగండి. ఆ రైతులందరికీ స్వయంగా కడుపునిండా భోజనాలు పెట్టించి, కట్టుకోడానికి కొత్తబట్టలు, తిరుగు ప్రయాణానికి ఛార్జీలు యిప్పించి సాగనంపారట. ఎంత గొప్ప సంగతో కదా యిది. ఆయన దాతృత్వాన్ని గురించి అంతో యింతో విన్నాం కాని, మా పెద్దవాళ్ళెవరు యీ సంగతి చెప్పినట్టు గుర్తులేదు.

ఇది చదివిన తరువాత నాలో ఒక ప్రశ్న రేగింది. కొన్ని తరాలపాటు ఆ వూరుని ఏలి అవినాభావ సంబంధం ఏర్పరచుకున్న ఆ కుటుంబానికి చెందిన యీతరం వాళ్ళు యిప్పుడెవరన్నా ఉయ్యూరుకి వస్తే వాళ్ళని గుర్తుపట్టే వారే వుండరుగదా అని. గుర్తుపట్టకపోవడం మాట అటుంచండిగాని, కనీసం ఇంటికి పిలిచి గుక్కెడు మంచి నీళ్ళయినా యిచ్చే వాళ్ళున్నారా అని ఆ మధ్యనోసారి మావాడితో అంటే – "ఓ దానికేం ఫర్లేదు బాబాయ్, ఉయ్యూర్లో యిప్పుడు ఎక్కడబడితే అక్కడ మినరల్ వాటర్ బాటిల్సు దొరుకుతున్నాయి, అంతగా దాహమేస్తే కొనుక్కుని తాగుతార్లే' అదీ నిజమే మరి, ఈ తరం దృష్టిలో .....

* * *

## మూడు శకాలు

ఉయ్యూరుతోపాటు చుట్టుపక్కల వున్న అనేకానేక గ్రామాల అభివృద్ధిలో బహుశా మూడు దశలు వుండవచ్చని అనిపిస్తుంటుంది. మొదటిది – కాటన్‌దొరవారి చలవతో కృష్ణానదికి విజయవాడ దగ్గిర నిర్మించిన ఆనకట్ట వల్ల పంట కాలవలతో మొత్తమంతా మాగాణీ ప్రాంతంగా మారి సస్యశ్యామలం కావడం, పొలాలతో పాటు రైతులు కూడా పచ్చగా వుండటం.

రెండోది – ఎప్పుడైతే కాలవలు సంవత్సరంలో దాదాపు పదినెలలపాటు నీళ్ళతో నిండినాయో 1914 శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారికి కె.సి.పి. లిమిటెడ్ స్థాపించి పంచదార ఫ్యాక్టరీ ఉయ్యూరులో నిర్మించాలని తోచటం, దాంతో రైతులు ఆర్థికంగా మరింత మెరుగుపడటం. స్వాతంత్రానికి ముందు జెంషెట్‌జీ టాటా (తెలుగులో ఎందుకో తాతా అంటాం!) దేశానికి పారిశ్రామిక దిశానిర్దేశం చేసినట్టు కృష్ణాజిల్లాలో అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారి చొరవ కూడా అంతటిదే. వారి అల్లుడు – మైసూరు సంస్థానంలో దివానుగా పనిచేసిన శ్రీ వెలగపూడి రామకృష్ణ ఐ.సి.యస్ (యిప్పటి ఐ.ఎ.యస్.కి ముందు బ్రిటిష్‌వారు పరిపాలనా సౌలభ్యం కోసం నెలకొల్పిన సర్వీసు అది, రిటైరైన ఐ.సి.యస్ వారికి పెన్షను బ్రిటన్ కరెన్సీ పౌండ్లలో చెల్లించాలన్న సర్వీసు నిబంధన వుంటే శ్రీమతి ఇందిరాగాంధీ ఒక్క కలంతో గీతతో మార్చేశారు.), ఆ తరువాత వారి కుటుంబీకులూ కె.సి.పి. లిమిటెడ్ సర్వతోముఖ అభివృద్ధికి పాటుపడ్డారు. చక్కెర మిల్లుతో మొదలై మద్రాసులో పెద్ద ఇంజనీరింగ్ సంస్థ, మరికొన్ని చోట్ల షుగర్ ఫ్యాక్టరీలు,





సిమెంటు ఫ్యాక్టరీలు వెలసి కె.సి.పి. లిమిటెడ్ దక్షిణ భారతదేశంలో ఒక పారిశ్రామిక దిగ్గజంగా వెలుగొందుతోంది. (ఉయ్యూరులో ఈ పరిశ్రమ ప్రప్రథమంగా సహకార రంగంలో చక్కెర కర్మాగారంగా రూపుదిద్దుకుంది. ఈ విషయం ఇప్పటి తరానికి తెలియదు).

మూడోది – ఆంధ్రప్రాంతం (సర్కారు, రాయలసీమలోవి కొన్ని జిల్లాలు) ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వున్నప్పుడే, అంటే 1953కి ముందుగానే మొదటి ప్రైవేటు పాలిటెక్నిక్ కాలేజీని ఉయ్యూరులో స్థాపించటం. ఇది కూడా వారి పుణ్యమే. దాని పేరు ఎ.జీ.టీ. (అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య టెక్నికల్) ఇనిస్టిట్యూట్. నెహ్రూగారి ముందుచూపుతో దేశ మంతటా పెద్ద పెద్ద డ్యాముల నిర్మాణం చేపట్టటం జరిగింది. రిజర్వాయర్లతో నదుల వుధృతిని, వరదల్ని నియంత్రించి ఆ నీటిని సాగుబడికి, విద్యుత్తు వుత్పాదనకి వుపయోగించటం ప్రయారిటీ అయింది. వాటిల్లోవే భాక్రా–నంగల్ ప్రాజెక్టు, హిరాకుడ్ డ్యాం మరెన్నో. ప్రాజెక్టులకే కాక రోడ్లు, బిల్డింగుల నిర్మాణానికి ఎంతోమంది సివిల్ ఇంజనీర్లు కావలసి వచ్చారు. అందుచేత యిక్కడి పాలిటెక్నిక్‌లో ముందు సివిల్ ఇంజనీరింగ్ విభాగం, మెకానికల్ విభాగం, మరికొన్ని ఏళ్ల తరువాత ఎలక్ట్రికల్ విభాగం – చివరికి ఐటీఐ కూడా వరుసగా చేర్చారు.

వివరాల్లోకి వెడితే పంచదార ఫ్యాక్టరీ ఊరి చుట్టుపక్కల ప్రాంతాల్లో ఒక సైలెంట్ రివల్యూషన్ తెచ్చి వుండవచ్చు. రైతుల ఆదాయం గణనీయంగా పెరగటమే కాదు పంట మార్పిడికి కూడా యిది దోహదపడింది. మరింత మందికి, ముఖ్యంగా వలస కూలీలకి ఉపాధి కల్పించింది. ప్రాదేశికంగా వుద్యోగావకాశాలకి ఆటపట్టయింది. గ్రామస్తుల జీవితంలో కూడా మార్పులు తెచ్చింది. ఆరోజుల్లో చేతిగడియారాలు, అలారం టైం పీసులు చాలా తక్కువమందికి ఉండేవి. ఎవరో కొంతమంది యిళ్ళల్లో గోడగడియారాలుంటే తప్ప టైము తెలుసుకోవటం సూర్యుడి గమనాన్ని బట్టి వూహించుకోడమే. ఠాణాలో గంటలు కొట్టేవారట. ఆ తరువాత పాలిటెక్నిక్‌లో రామస్వామి అనే అతను గడియారం చూసి ప్రతి గంటకీ గంటలు కొడుతుండేవాడు. వాటిని లెక్కపెట్టుకోవాలి – ఎన్ని గంటలు కొడితే టైము అంతన్నమాట. అయితే ఫ్యాక్టరీలో వుదయం ఏడునించి ఏడున్నర లోపల మూడుసార్లు సైరన్, ఆ తరువాత లంచి టైముకి పన్నెండున్నరకల్లా మళ్ళీ సైరన్ చివరిసారి సాయంత్రం ఐదున్నరకి

ఆఖరిసైరన్ మోగటంతో గ్రామస్తులు వీటికి అలవాటు పడ్డారు. సైరన్ చాలా దూరానికి వినిపిస్తుండేది, బహుశా యిప్పటికీ అంతేననుకుంటా.

మరి గ్రామంలో దైనందిన జీవితంలో ఎలాంటి మార్పుల్ని తెచ్చిందో చూద్దాం. ఉయ్యూరులో వుద్యోగస్తులంటే – స్కూలు టీచర్లు, పోస్టాఫీసు, ఆంధ్రా బ్యాంకు, సహకార పరపతి సంఘం, భూమి తనఖా బ్యాంకుల సిబ్బంది, కాలవల ఓవర్సియర్, అగ్రికల్చర్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు కొంతమంది గెజిటెడ్ ఆఫీసరు సంతకం కావలంటే కష్టంగా వుండేది. అలాంటి నేపథ్యంలో కె.సి.పి. లిమిటెడ్‌లో పనిచేసే ఉద్యోగస్తులకి ఆదరణ ఎక్కువుండేది. అలాంటి నేపథ్యంలో కె.సి.పి. లిమిటెడ్‌లో పనిచేసే వుద్యోగస్తులకి ఆదరణ ఎక్కువుండేది. కాలవగట్టు అవతల కాలనీలో క్వార్టర్సు కట్టించారు, ఫ్యాక్టరీ పక్కనే పెద్ద వుద్యోగస్తులకి ప్రత్యేకంగా క్వార్టర్సు కట్టించారు. ఆ ఉద్యోగస్తుల పిల్లలు మాతోపాటు హైస్కూల్లో చదవటం వల్లనే పరిచయాలుండేవి. అందరితో కలవడానికి ఫ్యాక్టరీ ఉద్యోగులకి టైము దొరికేది కాదు. అందుచేత చాలా మందికి వాళ్ళు తెలియదు. ఉయ్యూర్లోనే పుట్టి అక్కడ ఉద్యోగం దొరికిన వాళ్ళయితే తప్ప. నిత్య జీవితంలో చాలా తక్కువగా కలిసేవారప్పుడు. విష్ణాలయం సింహద్వారానికి కుడిపక్కనున్న వేదాంతం రామచంద్రాచార్యులుగారి వరండా అరుగుమీద కొంతమంది ఉద్యోగస్తులు ఆయనతో సాయంత్రం పూట పేకాడుతూ కనిపిస్తుండేవాళ్ళు.

వేదాంతం రామచంద్రాచార్యులుగారు స్ఫురద్రూపి. నలుపైనా ఆజానుబాహువు, మంచి వొడ్డూపొడుగూతో వుండేవారు. నుదుటి కింద కనుబొమ్మల దగ్గర మొదలైన ఊర్ధ్వపుండ్రాలు (నామాలు) పైపైకి ఎగబాకుతూ తలభాగం సగం వరకూ ఆక్రమించేవి. విష్ణాలయంలోనూ, ఆంజనేయస్వామి గుడిలోనూ వంశపారంపర్యంగా వంతుల ప్రకారం ప్రతి మూడో సంవత్సరానికి వారికి అర్చకత్వం సంక్రమించేది. పెద్ద యిల్లు, పొలాలు. తీరుబడి వున్నప్పుడు ఆయుర్వేద వైద్యం చేస్తుండేవారు. ఉళ్ళో తక్కువే అయినా పొరుగూళ్ళలో అటు అటు మద్దూరు, చలివేంద్రపాలెం వరకూ యిటు కడవకొల్లు, కాటూరు లాంటివన్నిటికీ జట్కా (గుర్రపు బండి) కట్టుకుని వెళ్ళి వస్తుండేవారు.

శివాలయంలో పూజార్లు కూడా, ముఖ్యంగా మామిళ్ళపల్లి నాగేశ్వరరావు గారు వగైరాలు వూళ్ళోనూ, పొరుగూళ్ళలోనూ ఆయుర్వేద వైద్యం చేసేవారు. అలోపతీకి నరసింహమూర్తిగారనే యల్‌యంపి. డాక్టరొక్కరే వుండేవారు. టైఫాయిడ్, మలేరియాలు,





మశూచి, ఆటలమ్మ లాంటివన్నీ ప్రబలంగా వుండేవి. వీటికి ఆయుర్వేద వైద్యంలో లంఖణాలు, కషాయం అయితే అలోపతిలో మిక్స్చరు, పొడికొట్టిన మాత్రల పొట్లాల మందులు. ప్రిప్రిస్కప్షన్లు రాసి యివ్వటం చాలా అరుదు. అలోపతి డాక్టరు దగ్గరకి వెళ్ళాలంటే ఖండితంగా మిక్స్చరు కోసం బాటిలు తీసుకునే వెళ్ళాలి. ఆ బాటిలుకి డోసు చూపేందుకు మొన తేలిన గాట్లు పెట్టుండేవి, అయినా అందరియిళ్ళల్లో ఔన్సు గ్లాసులుండేవి. వాటితో ముందు డోసు కొలిచి యివ్వాలి. నరసింహమూర్తిగారు రోగిని చూడటానికి యింటికే వచ్చేవారు. గుమ్మంలోకి ఆయన అడుగు పెడుతుండగానే వేడినీళ్ల కోసం కుంపటి వెలిగించేవారు. ఇంజక్షన్ సిరంజిని, సూదిని ఆ నీళ్ళల్లో ఒకసారి ముంచి లాగి పిచికారిలా నీళ్ళని బయటికి చిమ్మించేవారు. ఆరోజుల్లో స్టెరిలైజేషన్ అంటే అదే. ఆ తరువాత కనకమేడల రంగారావుగారితో యం.బి.బి.యస్. డాక్టర్లు వరసుగా రావడం జరిగింది. రంగారావుగారికి ప్రాక్టిస్ కన్నా రాజకీయాల్లో మక్కువ వుండటంతో పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగా ఎన్నికై వైద్యం తగ్గింది.

అయితే ఎప్పటినుంచో వున్న సి.బి.యం. – కెనెడియన్ బాప్టిస్ట్ మిషన్ – హాస్పిటల్ ఉయ్యూరుతో సహా చుట్టుపక్కల అన్ని వూళ్ళకీ – ముఖ్యంగా ప్రసూతికి వెసులుబాటుగా వుండేది. క్రమక్రమంగా అగ్రవర్ణాలవారు కూడా మంత్రసాని మీద ఆధారపడటం మానేసి అక్కడికే వెళ్లడం మొదలెట్టారు. కెనడానించి వచ్చిన లేడీ డాక్టర్లు తెలుగు నేర్చుకుని రోగులతో, 'భయపడకండి, ఏసుని నమ్ముకోండి' అంటూ మతప్రచారం కూడా పనిలో పనిగా కానించేవారు.

వ్యవసాయమే ప్రధాన వృత్తి కావడంతో ఆవులు, ఎద్దులు, గేదెలు, దూడలు విపరీతంగా వుండేవి. వాటికోసం మంచి పశువుల ఆస్పత్రి కూడా వుండేది. డాక్టరు సుబ్బారావుగారు ఖాకీ నిక్కరులో తెల్లటి చొక్కా ఇన్‌షర్టు వేసుకుని నోట్లో పొడుగాటి చుట్ట పెట్టకుని నిస్వార్థంగా వాటి ఆరోగ్యాన్ని పరిరక్షించేవారు. ఆయన వ్యవహారనామం పశువుల డాక్టరే.

ప్రతి సంవత్సరం నవంబరు నెల వచ్చిందంటే రైతుల్లోనే కాదు గ్రామస్తులందర్లో ఒక నూతనోత్సాహం వుంటేండేది. కారణం చెరుకు చేలు ఏపుగా పెరిగి ఫ్యాక్టరీకి తోలడానికి చెరుకు గడలు తయారుగా వుండేవి. 'విన్నావా, ఫ్యాక్టరీలో నిన్న బొగ్గేశారటయ్యా' అనంటే, అవునయ్యా వంగల సుబ్బావధానులుగారి చేత ముహూర్తం

పెట్టించారట, పూజ కూడా ఆయన చేతే చేయించారు, వచ్చిన బ్రాహ్మలందరికీ ఐదేసి రూపాయలు సంభావన యిచ్చారయ్యా' లాంటి సంభాషణలు వినబడుతుండేవి. బొగ్గు వెయ్యటమంటే బాయిలర్ వెలిగించి చెరుకు క్రషింగ్ సీజన్ మొదలుపెట్టటమన్నమాట. సీజనొచ్చిందంటే చాలు బారులు తీరిన చెరుకు బళ్లు రోడ్డు మీద నడుస్తాయి; పశువులకి మేతగా చెరుకు దంటు మోపులు దొరుకుతాయి. చెరుకు తోలిన రైతులకి డబ్బు చేతికందుతుంది. సీజన్లో తాత్కాలికంగా కొన్ని వుద్యోగాలు దొరుకుతాయి – యిలా ఎన్నెన్నో ఆరు నెలలకి పైగా ఒక ప్రత్యేకమైన వాతావరణం వుంటుండేది. మెయిన్ రోడ్డులో తప్ప వూళ్ళో మరెక్కడా కరెంటు లేకపోవడంతో రాత్రిపూట ఫ్యాక్టరీ వైపుగా వెడితే దేదీప్యమానంగా లైట్లు వెలుగుతూ పట్టపగలులా కనిపించేదక్కడ. ధృవ ప్రాంతాల్లో ఆరునెలలు చీకటి వున్నట్టుగా ఉయ్యూరులో జీవనరంగాన్ని – సీజను ఆరునెలలు, ఆఫ్ సీజను ఆరునెలలుగా వ్యవహరించవచ్చు.

ఇంకా పాలిటెక్నిక్ కాలేజి గురించి కొంత తెలుసుకుందాం. ఈ కాలేజి స్థాపనకి శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య గారి కృషి ఎంతోవుందని చెప్తూతారు. ఉయ్యూరు రాజావారు సహకరించి దానికి కావలసిన కొన్ని ఎకరాల స్థలాన్ని విరాళంగా యిచ్చారని ప్రతీతి. డిగ్రీ చదువులు చాలామందికి ఆర్థికంగా అందుబాటులో వుండేవి కావు. కృష్ణాజిల్లా మొత్తానికి కేవలం బెజవాడలో రెండు, బందరులో రెండు డిగ్రీ కాలేజీలు మాత్రం వుండేవి. గుడివాడలో తరువాత వచ్చింది. అయితే డిగ్రీ చదువులో వుండే గ్లామరు పాలిటెక్నిక్ కాలేజీలో డిప్లొమాకి వుండేది కాదు. డిప్లొమా చెయ్యటం నామోషీగా వుండేది కొంతమందికి. పెరటి చెట్టు మందుకు పనికిరానట్టుగా ఉయ్యూరు చుట్టుపక్కల వాళ్ళకన్నా బయటినుంచి వచ్చి చేరిన విద్యార్థులే చాలా ఎక్కువ.

మొదట్లో పాలిటెక్నిక్‌కి హాస్టలు సదుపాయం వుండేది కాదు. తరువాత కట్టిన హాస్టలు బిల్డింగులో యిప్పుడు డిగ్రీ కాలేజి నడుస్తోంది. స్టూడెంట్స్ అందరూ బయట గదులు అద్దెకు తీసుకుని వుంటుండేవాళ్ళు. భోజనానికి కూడా కేవలం ఒకటో రెండో హోటళ్ళు వుండేవి. శివాలయంవీధిలో వంగల వెంకాయమ్మగారి యిల్లు మొత్తం అద్దెకున్న కాలేజీ స్టూడెంట్సుతో నిండిపోయుండేది. నాయీ బ్రాహ్మలు ఈ స్టూడెంట్సు అవసరాలకే పరిమితమయ్యేవాళ్ళు. దీనికి కారణం ఆరోజుల్లో యింటి చాకలికి తదితరులకి జీతం సంవత్సరానికి ఒక బస్తా వడ్లు. మరి స్టూడెంట్సు దగ్గర అయితే ఏ రోజుకారోజో లేక నెలకోసారో డబ్బులు వస్తుండటం.





పాలిటెక్నిక్ స్టూడెంట్సులో చాలామంది ఆర్థిక స్థోమత తక్కువ వున్నవాళ్ళేనని చూశాం కదా, మీరు కాక మరీ పేద విద్యార్థులు కేవలం పొట్టి ఫీజు మాత్రమే కట్టగలిగిన వాళ్ళని ఉయ్యూరు గ్రామస్తులు సహృదయంతో చదువు మీదున్న గౌరవంతో ఆదరించారు. ఈ పేద విద్యార్థులు కాలేజీలో జాయినవంగానే వచ్చి, 'అమ్మా, మీయింట్లో వారానికి ఒకరోజు రెండు పూటలా భోజనానికి వస్తానమ్మా' అని అడిగితే, 'దానికేముంది నాయనా, టైముకొచ్చి మా పిల్లల్తో పాటే వున్నదింత తినిపో బాబూ' అని చెప్పని గృహిణి ఆవూర్లో లేదని చెప్పవచ్చు. మా అమ్మగారు కొన్ని దశాబ్దాలపాటు యిలా వారాలబ్బాయిల్ని పోషించేది – అందులో వారానికి ఏడు రోజులూ వుంటుండేవారు. ముందు యిది బ్రాహ్మణులకే పరిమితమైనా తరువాత బ్రాహ్మణేతరులకి కూడా వారాలు పెట్టేదావిడ. ఒక్క కండిషన్ మాత్రం వుండేది – ఎవరి విస్తరి వాళ్ళు ఎత్తి బయట పడెయ్యాలనేది మాత్రం. ఈ రకమైన భోజన సదుపాయంతో ఎంతోమంది బీద విద్యార్థులు కోర్సు పూర్తి చేసుకుని ఉద్యోగంలో స్థిరపడిన తరువాత ఒక్క ఉత్తరం ముక్క రాస్తే సంబరంగా చెబుతూ సంతోష పడుతుండేది మా అమ్మగారు. అలాంటి అన్నపూర్ణమ్మలు గ్రామంలో చాలామంది వుండటం అప్పటి స్టూడెంట్సు చేసుకున్న సుకృతం, ఆ కాలపు సామాజిక స్పృహ అని అనుకోవచ్చు.

రామస్వామి అనే ప్యూను గంటలు కొడుతుండేవాడని ముందు చెప్పాను. రామస్వామి ముతక ఖద్దరు పంచె, పొడుగాటి లాల్చీ వేసుకుని స్వామి వివేకానంద గెటప్‌లో పెద్ద ఖద్దరు పంచెని తలపాగా చుట్టుకుని గేటు బయట నుంచునుంటే చూసి మేమంతా భయపడుతుండేవాళ్ళం. కాలేజీ లోపల ఎలా వుంటుందోనన్న కుతూహలం చాలా రోజులపాటు కుతూహలంగానే వుండిపోయింది అతని మూలంగా. గాంధీగారు చనిపోయినప్పుడనుకుంటా (1948) లోపల మీటింగు పెట్టుకుని అందరూ వలవలా ఏడుస్తుంటే బయట కిటికీ చువ్వలు పట్టుకుని మేమంతా చూసిన దృశ్యం యిప్పటికీ గుర్తుంది.

కాలేజి వార్షికోత్సవాలకి సాయంత్రంపూట అందర్నీ లోపలికి వదులుతుండేవాడు రామస్వామి. చాలా గొప్పగా వుండేవా సభలు. కాటూరి వెంకటేశ్వరరావు గారిని చూసిందీ, ఆయన వుపన్యాసం విన్నదీ అప్పుడే. నాటకాలు కూడా బాగుంటుండేవి. *తాజ్‌మహలులో ముంతాజ్ నీవు ... ఈ విశాల ఏకాంత సౌధంలో నిదురించే జహాపనా..*

అనే పాటుల స్టేజి మీదున్న చిన్న గోరీ సెట్టు దగ్గర ఒకాయన చాలా బాగా పాడటం గుర్తు. చారిగారనే లెక్చరరు స్టేజి డెకరేషన్ బాగా చేసేవారు. ఇలా సాంస్కృతిక కార్యక్రమాలు జరిగినప్పుడల్లా మేమంతా వెడుతుండేవాళ్ళం. బహుళా ముద్దుబిడ్డ సినిమా రిలీజైన తరువాతనుకుంటా – బందరునించి బెజవాడ వెడుతూ దారిలో ఒక మధ్యాహ్నం పూట జమున, జగ్గయ్యలు కాలేజీకి వచ్చి వెళ్ళటం గుర్తు. అప్పుడు వైస్ ప్రిన్సిపల్ నరసింహమూర్తిగారని వుండేవారు. ఆయన కుటుంబంతో, ఆయన భార్య సునందగారి కుటుంబంతో మా కుటుంబానికి హిందూపురంలో వున్నప్పుడు బాగా పరిచయముండేది. మూర్తిగారు కన్నడిగులు, తెలుగు సరిగా వచ్చేదికాదు. అందువల్ల జమునకీ, జగ్గయ్యకీ ఆయన స్వాగతం యీ విధంగా చెప్పటం బాగా గుర్తు – ఈల మద్దేన్నమూ మనమందరమూ ... అంటూ సాగిందది. కాలేజీకి ప్రిన్సిపాలుగా శ్రీ పి. హెచ్. యన్. బి. శర్మగారు వుండేవారు. ఇంటిపేరు పుచ్చావారు, అయినా ఆయన తెలుగు మాట్లాడటం మేమెప్పుడూ ఎరుగం. ఆ రోజుల్లో చిన్న మసీదుకి వెనుక రాయప్రోలు కోదండరామయ్యగారనే వారిల్లు వుండేది. ఆ యిల్లు కొంతవరకు మోడరన్‌గా వుండేది, కరెంటు వుండేది. ప్రిన్సిపాలు గారు ట్రాన్సఫరయే వరకూ అక్కడే అద్దెకుండేవారు. కాలేజీకి అందరూ నడిచే వెళ్ళేవారు. వాళ్ల మధ్యలో పచ్చటి ఛాయితో మెరుస్తుండే శర్మగారు సూటూ బూటూ వేసుకుని టై కట్టుకుని ఠీవిగా కాలేజీకి వెడుతుంటే గ్రామస్తులందరూ పక్కకి జరుగుతూ గౌరవంగా అబ్బురంగా చూసేవాళ్ళు.

మహేశ్వరరావు అనే యల్.సి.ఈ స్టూడెంటు శివాలయంలో వున్న ఖాళీ స్థలంలో సాయంత్రంపూట ఆర్.ఎస్.ఎస్. శాఖ నడుపుతుండేవాడు. అరడుగుల ఎత్తున్న జెండా కర్రని పాతి దానికి వాళ్ళ కాషాయ జండాని తగిలించి, 'నమస్తే సదా వత్సలే మాతృభూమే తదర్థే...' అంటూ ప్రార్థన చేయించి కాసేపు లాఠీలతో డ్రిల్లు చేయించేవాడు. ఒక్కొక్కప్పుడు ఎవ్వరూ రాకపోతే తానొక్కడే జండావందనం చేసి సూర్యాస్తమయం వరకూ ఆగి జెండా తీసి మడతపెట్టి సంచీలో సర్దుకుని వెళ్ళిపోయేవాడు. ఉయ్యూరులో ఆరెస్సెస్‌కి అంకురార్పణ చేసింది అతనే. ఆ తరువాత జనసంఘ్ (ప్రస్తుత బీజెపి) పార్టీ కొంత ప్రాబల్యం సంపాదించుకుంది.

కాలేజీకి పదెకరాల పైన మంచి మైదానం వుంది. క్రికెట్ మ్యాచ్‌లు చాలా తరచుగా జరుగుతుండేవి. ఎల్.సి.ఈ. వెర్సస్ ఎల్.ఎమ్.ఈ; స్టూడెంట్స్ వెర్సస్ క్రికెట్ మైదానానికీ మధ్యగా రెండు వెలగచెట్లు పక్కపక్కన వుండేవి. వాటికింది నుంచుని





నేనూ, మా మేనమామ కొడుకు పద్మనాభమూ మ్యాచి అయిపోయేదాక చూస్తుండేవాళ్ళం. అప్పటి గొప్ప ఆటగాళ్ళు – డి. నాగేశ్వరరావు (ఎల్.సీ.ఈ) అనే బ్యాట్స్‌మన్, వీరయ్య (ఎల్.ఎమ్.ఈ) అనే వికెట్ కీపర్, సుబ్రహ్మణ్యం (ఎల్.ఎమ్.ఈ) అనే బౌలరు. శంకర్రావనే లెక్చరరు ఆల్‌రౌండరు.

ఇలా మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వెలుగుతున్న కాలేజీ వైభవం వున్నట్టుండీ (1962–63) పడిపోయింది. కాలేజీని గవర్నమెంటువారు తీసుకుంటారనీ, అందరి సౌకర్యం కోసం విజయవాడకి మారుస్తారనీ తెలిసింది. అప్పటి యాజమాన్యం గవర్నమెంటు తీసుకోడానికీ, విజయవాడకి మార్చటానికి వొప్పుకోలేదు. మౌలిక వసతులు – ముఖ్యంగా పిల్లలపై చదువులు, అద్దెయిళ్ళ సదుపాయాలు, భోజన వసతులు లేకపోవడంతో లెక్చరర్సు కూడా విజయవాడకే మొగ్గుచూపారు. దాంతో గ్రామస్తుల అందోళన మొదలైంది. కనుమూరుకి చెందిన కొల్లి రామకుమార్ వర్మగారి సారధ్యంలో కొన్నివారలపాటు అందోళన నడిచింది. ఒకరోజు గోరా (గోపరాజు రామచంద్రరావు) గారు కూడా వచ్చి రాజకీయపార్టీలని దూరంగా వుంచి సామూహికంగా రిలేనిరాహార దీక్ష పాటించి అడ్డుకోమని గ్రామస్తులకు సలహా యిచ్చి వెళ్ళారు. కొల్లి రామకుమార్ వర్మగారు నిరవధిక నిరాహార దీక్షకి పూనుకుంటే మాలంటివారం ఇరవై నాలుగు గంటల రిలే నిరాహార దీక్ష చేశాం. అయినా చివరికి ప్రభుత్వం పట్టు సడలించకుండా తన పంతాన్ని నెగ్గించుకుంది. వొట్టిపోయిన భవనాల్ని సమాధుల్లాగా మిగిల్చి ది ఏ.జీ.టీ. ఇనిస్టిట్యూట్ శాశ్వతంగా మూగబోయింది. అలా ఒక గొప్ప శకం అంతరించింది. ఎన్నో ఏళ్ళ తరువాత హాస్టలు బిల్డింగుని కొంత మార్పు చేసి డిగ్రీ కాలేజి మొదలెట్టారు కాని ఆ పాలిటెక్నిక్ కాలేజీ వైభవమే వైభవం.

ఎప్పటికైనా అక్కడొక గొప్ప ఇంజనీరింగ్ కాలేజి వస్తే శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య గారి ఆత్మకి శాంతి చేకూరుతుందని ఆశిద్దాం.

* * *

# శ్మశానంలో హైస్కూలు

1951కి ముందు ఉయ్యూరులో హైస్కూలు లేదు. దగ్గరి హైస్కూలు అటు ఆకునూరు, యిటు మంటాడ. శ్రీకాకాని వెంకటరత్నంగారి చలవతో వూరికి హైస్కూలు వస్తున్నదని సంబరపడ్డారు అందరూ. అప్పుడాయన కృష్ణాజిల్లా బోర్డు ప్రెసిడెంటు, తరువాత అది జిల్లా పరిషత్తుగా మారింది. ఐతే ఆ స్కూలుని కాస్తా అప్పటి శ్మశానంలో రెల్లుకప్పుతో పొడుగాటి నిట్టాడి పాకలు రెండు మూడు వేసి వాటిల్లో పెట్టారు. ఒకటి రెండు సంవత్సరాలపాటు శ్మశానం కూడా స్కూలుతో బాటు అక్కడే కొనసాగింది. తరువాత దాన్ని కాటూరు రోడ్డులో వూరి చివరకి మార్చారు. ఇప్పుడు వూరే అటు పెరిగి దాన్ని దాటింది. మరిన్ని పాకల కోసం ప్రతి విద్యార్థి తల్లిదండ్రుల నుంచి ఐదేసి రూపాయల చొప్పున పాకల రుసుం వసూలు చేశారు మొదట్లో. వంగల కృష్ణదత్తుగారు చనిపోయిన చెల్లెలు కృష్ణవేణి జ్ఞాపకార్థం ముప్ఫయివేల రూపాయలు (దాదాపు అరవై సంవత్సరాల కిందట – యిప్పటి విలువ బహుశా కోటికి పైనే) బిల్డింగక ఫండుగా విరాళమిచ్చారు. అయినా చాలాకాలంపాటు నాలుగు పొడుగాటి రెల్లుగడ్డి పాకల్లోనే స్కూలు నడిచింది.

స్కూలుకి రెండు రోడ్లు వుండేవి. ఒకటి శివాలయం పక్కనున్న సందులోంచి నూనె చంద్రయ్య గానుక దాటినంతవరకు కంకర రోడ్డు, ఆ తరువాత మట్టిరోడ్డు; వీరమ్మ గుడికి యివతల నించి యింకొక మట్టి రోడ్డు వుండేవి. స్కూలు పిల్లల శ్రమదానంతో రెండో దానికి యిటికెరాయి మొరుంతో తరువాత రోడ్డు పడింది. శివాలయం పక్కనున్న రోడ్డులో వానాకాలంలో బురద వుండేది. వాన వస్తే ఫైవ్ పిరియడ్స్ కంటిన్యూ చేసి యిళ్లకి పంపిస్తారని మాకు ముందే తెలుసు. యాకమూరు, కనకవల్లి, గరికపర్రు నుంచి వచ్చే స్కూలు పిల్లలు చిన్న వంతెన దాటి, పాలిటెక్నిక్ కాలేజీ మీదనించి తూర్పు వాళ్లగుడిసెల్లోంచి కాని, అటు సీతంరాజు కరణం వారింటి మీదుగా గుండు గంగయ్యగారి మామిడి తోటలోంచి కాని వచ్చేవాళ్లు. పిల్లలు, టీచర్లు అంతా నడిచే స్కూలుకి వచ్చేవాళని వేరే చెప్పక్కర్లేదు – కొంతమందిమినహా. రామినేని బుచ్చిబాబు గారబ్బాయి ఏకాంబరేశ్వర్రావు స్కూలుకొచ్చిన కొద్దిరోజులు మోటారు సైకిలు మీద వచ్చేవాడు. చాలా తక్కువ మంది టీచర్లు సైకిలేసుకుని వచ్చేవారు.





బురదైనా పాకైనా స్కూలు జీవితం చాలా బాగుండేది. దానికి ప్రధాన కారణం ఉపాధ్యాయుల అంకితభావం, చిత్తశుద్ధి, చదువు గురించి తల్లిదండ్రుల తాపత్రయం కూడా అనుకుంటా. మొదట్లో ప్రవేశ పరీక్షలు పెట్టి ఫస్టుఫారం (ఆరో తరగతి) నించీ స్కూలు ఫైనలు (పదకొండవ తరగతి) దాకా పిల్లల్ని తీసుకున్నా, క్రమంగా ఐదు సంవత్సరాల ఎలిమెంటరీ విద్య కంపల్సరీ అవటంతో కేవలం ఫస్ట్‌ఫారం కోసమే ప్రవేశ పరీక్షలు నిర్వహించేవాళ్ళు.

స్కూళ్లు తెరుస్తారనగా పాత నోటు పుస్తకాలలో మిగిపోయిన వాడని కాగితాలన్నీ చింపి రఫ్ నోటుబుక్కు తయారు చేసుకోవడం మామూలు. లావుపాటి రఫ్ పుస్తకాల్ని వేదాంతం నారాయణాచార్యులుగారి కుమారులు రామాచార్యులు, వాసుదేవాచార్యులు యింట్లోనే పెట్టుకున్న హయగ్రీవ బైండింగ్ వర్క్సుకి తీసుకెడితే గట్టి అట్ట వేసి ట్వైన్ దారంతో కుట్టి కటింగ్ మెషినుతో సమంగా కట్ చేసిచ్చేవారు. వేదాంతం వారు వైఖానస వైష్ణవులు. విష్ణాలయంలోనూ, ఆంజనేయస్వామి గుడికీ అర్చకులు; పొలాలు, స్థలాలు వుండేవి. విష్ణాలయం వెనుక ద్వారం పక్కనే వారిల్లు. బైండింగ్ వర్క్సు మూసుంటే వాళ్లని పిలవటానికి కష్టంగా వుండేది – వాళ్లు వంట చేసుకుంటున్నా, భోజనాలకి కూచున్నా (సాపాటు ఆరగిస్తున్నా) వేరే వాళ్ల మాట అటుంచి యితర శాఖలకి చెందిన బ్రహ్మలకి కూడా ప్రవేశం ఉండేది కాదు. రామాచార్యులుగారికి మంచి స్వరం వుండేది. విష్ణాలయంలో వుత్సవాలకి మంత్రాలు, శ్లోకాలు వుత్సాహంగా సుస్వరంతో పాడేవారు. అసలు ధనుర్మాసంలో తెలతెలవారుతుండగా విష్ణాలయంలోకి వెళ్లటం ఒక గొప్ప అనుభూతి – రాత్రికి రాత్రి చెట్టునించి రాలిన పొగడపూలు, ఎర్రటి కాడలతో మంచులా మెరిసే పారిజాత పుష్పాలు, పచ్చగన్నేరుపూలు, పున్నాగ పూలు; ఆ చెట్ల కింద సువాసనా భరితమైన రంగుల తివాచీని ప్రకృతి పరిచిందా అన్నట్టుండేది. రచయిత వంశీ చెప్పినట్టు అందమైన సువాసన! దీనికి తోడు ధనుర్మాసంలో దధ్యోజనం, చక్కెర పొంగలి ప్రసాదాలు మరో ఆకర్షణ.

ఇందాక ఉపాధ్యాయుల చిత్తశుద్ధి, అంకితభావం అని చెప్పుకున్నాం. ఆ సుగుణం కేవలం ఏ ఒక్క టీచరుకో లేక కొంతమంది టిచర్లకో పరిమితంకాదు. అదొక వృత్తి ధర్మంగా, బాధ్యతగా, సమాజ శ్రేయస్సు కోసం పిల్లల్ని తీర్చి దిద్దాలని భావించేవారు అందరూ. కొంతమంది సెకండరీ గ్రేడు టీచర్ల యిళ్ళల్లో రెండుపూటలా పొయ్యి

వెలగటం కష్టమవున్నదని గ్రామస్తులకి తెలిస్తే చాలు యితోధికంగా సహాయం చేస్తుండేవాళ్ళు. ఈ సహాయం డబ్బు రూపేణ కాకపోయినా – వస్తురూపేణ కూరా నారా, పెరుగో, మజ్జిగో, రెండు కుంచాల వడ్లో – యిలా రకరకాలుగా ఆదుకుంటుండేవాళ్ళు. ఉపాధ్యాయులకీ గ్రామస్తులకీ మధ్య పరస్పర గౌరవం చోటు చేసుకునేది. నెలాఖరు వచ్చేసరికి వంతుల ప్రకారం నెలకో మాస్టరు బందరు వెళ్ళి జిల్లా బోర్డునించి చెక్కుతెవాలి. మర్నాటి వుదయం ఒకటో తేదీన మళ్లీ ఆయన ఉయ్యూరు మీదుగా వెళ్ళే మేడూరు – గన్నవరం బస్సులో గన్నవరం తాలూకా ట్రెజరీలో చెక్కు జమచేసి క్యాష్ తెచ్చిన తరువాత జీతాల పంపకం జరిగేది.

ఒకసారి శ్రీ విశ్వనాథ సత్యనారాయాణ గారిని కొంతమంది గ్రామ పెద్దలు ఆహ్వానించి స్కూల్లో చిన్న మీటింగు పెట్టించారు. సాయంత్రం బెజవాడ బస్సుదిగి వచ్చారాయన. రామాయణ కల్పవృక్షంలోవి కొన్ని ఘట్టాలు చదవడం గుర్తుంది. కిన్నెరసాని పాటలు కూడా పాడారు. ఈలోగా చీకటి పడింది. గభాల్న యిళ్ళకి వెళ్ళి కిరసనాయిలు లాంతర్లు పట్టుకొచ్చి పెట్టాం. దీనికి సంధానకర్త వంగల సుబ్రహ్మణ్యంగారు. 'డాబా సుబ్బులు' అనేవారాయన్ని. శివాలయం వీధిలో యిప్పుడున్న వాటర్ ట్యాంకుకి ఎదురుగా ఆయనకొక్కడికే డాబా యిల్లు వుండేది, అందుకే డాబా సుబ్బులుగా వ్యవహరించేవారు. ఇప్పుడా డాబా మేడ అయింది. దాంట్లో స్క్రాపు వ్యాపారం నడుపుతున్నారెవరో. అయినా గరుగు (మెట్టభూమి) అన్న ప్రదేశంలో వూరికి కొంచెం దూరంగా కాలేజీకి వెనుకవైపు సుందరమైన పర్ణశాల కట్టుకుని అక్కడే వుంటుండేవారు. సాహిత్యాభిమాని, కళాభిమాని. ఆయన దస్తూరి ముత్యాల్లా వుండేది. తను రచించిన కొన్ని పద్యాలు రంగు రంగుల సిరాతో ముత్యాలు వొలకపోసినట్టు రాసి చక్కగా పుస్తకంటా కుట్టి కవిసామ్రాట్‌కి చదివి వినిపించారాయన. ఆ పుస్తకం కొన్ని రోజులు దత్తుగారింట్లో వుండేది, ఆ దస్తూరి యింకా కళ్ళముందు మెదులుతోంది.

మా తరంలో స్కూల్లో పనిచేసిన కొందరు ఉపాధ్యాయుల్ని గురించి స్మరించుకుని వాళ్ళ రుణం తీర్చుకోవచ్చునేమో. సెకండరీ లెవెల్లో సుబ్బరామయ్యగారు, బసవాచారిగారు, గరుడాచాలంగారు, ఆదిరాజు పూర్ణయ్య (పున్నయ్య) గారు, గురుజాడ పూర్ణచంద్రశర్మగారు, డ్రిల్లు మాస్టర్లు రామారావు, సుబ్బారావు వగైరాలు ఆద్యులు – దాదాపు స్కూలుతో పాటే వీరూ వచ్చారు. వీళ్ళందరూ పాఠాలు బాగా చెప్పటమే





కాదు, ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క విధంగా పిల్లల్ని చక్కగా, భావి భారత పౌరులుగా తీర్చి దిద్దడానికి కృషి చేస్తుండేవారు. స్వాతంత్ర దినోత్సవానికీ, డి.ఈ.ఓ. ఇన్స్పెక్షనుకీ డ్రిల్లు మాస్టారు సుబ్బారావుగారు పిల్లలతో లెజిమ్స్ వేయించేవారు. దానికి అనుకూలమైనది – ప్రేమలేఖలు (నర్గీస్, రాజ్ కపూర్ నటించిన తెలుగు డబ్బింగ్ సినిమా) లోని ఘల్లు ఘల్లు ఘల్లు ఘల్లు గజ్జెల సంగీతం, మువ్వల చెండూ హుషారు పసందు, వినే చెవి విందు ...... అనే పాట.

సుబ్బరామయ్యగారు స్వాతంత్ర దినోత్సవం, రిపబ్లిక్ డేలకి దేశభక్తి గేయాలు నేర్పించేవారు. లేటుగా వస్తే – కానీ, సగం రోజుకి వస్తే – అర్ధణా, పూర్తి రోజు రాకపోతే అణా ఫైను వేస్తూ ఆ డబ్బుని క్లాసు ప్యూపిల్స్ లీడర్ (సి.పి.యల్) చేత సంవత్సరం చివరిదాకా వసూలు చేయించారు. మా సెకండ్ ఫారంలో అలా వసూలు చేసిన డబ్బుతో చివరికి క్లాసంతా కలిసి టీ పార్టీ చేసుకోడానికీ, గ్రూప్ ఫోటో తీయించుకోడానాకి సరిపడింది. వూళ్లో వున్న ఒకే ఒక ఫోటో స్టూడియో – స్వతంత్ర స్టుడియోస్ తీశారా ఫోటో. ముక్కాళ్ల స్టాండు మీద కెమెరాని పెట్టి, దాన్ని నల్లటి గుడ్డతో మూసి కెమెరామన్ దాంట్లో చాలసేపు దాక్కుని లెన్సు అడ్జెస్టు చేస్తూ మళ్ళీ నుంచునే క్రమాన్నో, కూర్చును క్రమన్నో మారుస్తూ చివరికి అతనికి తృప్తి అయిన తరువాత యింకోసారి ముసుగులో దూరి లెన్సు మీదనించి కవరు తీసేముందు నవ్వాలి. స్మైల్ ప్లీజ్ అంటూ చెప్పి రెడీ – వన్, టూ, త్రీ అనేసి రక్కుమని కవరుతీసి మూసేవాడు. ఎందుకైనా మంచిదని యింకోసారి కూడా తీసేవాడు. అప్పుడు ప్లేటులాంటి ఫిలింని తీసేసి యింకో ప్లేటుని కెమెరాలో పెట్టిన తరువాత ముసుగులో దూరటంలాంటి తతంగమంతా మళ్లీ మామూలే.

కొంతమంది టీచర్ల మ్యానరిజమ్స్ బట్టి వాళ్లకి మారుపేర్లు కూడా వుంటుండేవి. తెల్లటి పంచె మీద లేత పసుపు సిల్కు లాల్చీ, చలవ కళ్ళజోడు, కాళ్ళకి రబ్బరు (హవాయి చెప్పులింకా రాలేదప్పటికి) స్లిప్పర్సు వేసుకుని బసవాచారిగారు స్కూలకొస్తుంటే ఆయనకి దసరా బుల్లోడు అనే మారుపేరొచ్చింది. అడ్మిషన్స్ టైములో గరుడాచలం గారు వుండేవారు. ఈయనకి ర పలకటం వస్తుండేది కాదు, రకారంతో వచ్చేవన్నీ గకారంతో పలికే వారాయన. రిజస్టరు (గిజిస్టగు) ముందేసుకుని వరసగా వస్తుండే పిల్లల్ని, 'ఆ, నీపేగేవిటి? నెంబగెంత?' అంటూ అడుతుండేవారాయన.

అప్పుడనిపించేది – యీయన తనపేగు (పేరు)ని చెప్పుకోవాలన్నా గగుడాచలం అని చెప్పుకోవాలిగా అని ! గురజాడ పూర్ణచంద్రశర్మగారు పాఠాలు ఎలా చెప్పినా, ఎవరైనా టీచర్లు రాని రోజున ఆ పిరియడ్లో ఆయన్ని పంపిస్తే అందరూ సంబరపడేవాళ్ళు. శర్మగారు కథలపుట్ట – నాలుగు కొమ్మల కథలు, కాశీమజిలీ కథలు, సహస్ర శిరచ్ఛేధ అపూర్వ చింతామణి మొదలైనవిన్నీ చెప్పేవారాయన.  సైన్సు మాస్టారు జె.వి.యస్. ప్రసాదశర్మగారు మొదటిసారిగా లేబరేటరీని వుపయోగించి చిన్న చిన్న ప్రయోగాలు క్లాసులో చేసి చూపేవారు. దాంతో సైన్సు సబ్జెక్టులో విద్యార్థులకి ఆసక్తి పెరిగింది.

తెలుగు మాస్టరంటే విధిగా గుండు, పిలక, సాధారణంగా బ్రాహ్మడుగా వుండే రోజుల్లో అలా కాని తెలుగు విద్వాన్‌లు వరసగా యిద్దరొచ్చారు. త్రిపురనేని సుబ్రహ్మణ్యం చౌదరిగారు మొదట, ఆ తరువాత తాతినేని లక్ష్మయ్య చౌదరి గారు. సుబ్రహ్మణ్యం గారు పద్యాల్ని రాగయుక్తంగా పాడుతూ పాప్యులర్ అయ్యారు కానీ, ఎక్కువకాలం వుండలేదు. లక్ష్మయ్య చౌదరిగారు పాఠం చెప్పటం ఎలా వున్నా వేరే విషయాలు చాలా చెబుతుండేవారు. ముఖ్యంగా నానార్ధాలు, వ్యుత్పత్తులు, సామెతలు వగైరా. మొందటిపాఠంలోనే శ్రీ పరవస్తు చిన్నయసూరి అని వుంటే ముందు శ్రీ అన్న పదానికున్న నానార్ధాలన్నీ – శోభాయమామైన, సంపత్కరమైనలాంటి విశేషణాలు : నామవాచకాలైన లక్ష్మి, సాలెపురుగు యిలా వరసగా దొర్లిపోతుండేవి. సామెతలకైతే – ఏడ్చేదాని మొగుడొస్తే నా మొగుడు రాడా, రాజుగారి రెండో భార్య పతివ్రతంటే మొదటి భార్య ఏవిటి । వంటివన్నీ సందర్భోచితంగా అంటుంటే అదో సరదాగా వుంటుండేది. ఏడు లోకాలు, నవరసాలు, నవరత్నాలు, పంచాంగం వంటి పదాలు ఎన్నిసార్లు వచ్చినా వాటిన్నన్నీ వరసగా ఏకరువు పెడుతుండేవారు – అతల సుతల రసాతల... పాతాళ : వజ్ర వైఢూర్య మరకత మాణిక్య గోమేధిక..: తిధి వార నక్షత్ర.. యిలా ఎన్నెన్నో. గబగబా యివన్నీ రాసుకుపోతుండేవాళ్ళం. నడిచే పెద్దబాలశిక్షగా చెప్పుకోవచ్చు ఆయన్ని. అప్పటి హెడ్ మాస్టరుగారి పేరు బులుసు గౌరీపతిశాస్త్రిగారు. స్కూలుకి కోటు వేసుకుని వచ్చేవారు. పొద్దున అసెంబ్లీ సమయంలో, ‘ఆ, స్కూలు మండే (సోమవారం)నాడు సెలవోయ్’ అంటూ ప్రకటించేవారు. వీలుకానప్పుడు నోటీసు పంపించేవారు. అది ఇంగ్లీషులో – **The school will remain closed on Monday on account of..** లేకపోతే **DEO inspection will be on...**అని వుంటే లక్ష్మయ్య చౌదరిగారు ఇంగ్లీషు చదవటం





రాదనే విషయాన్ని కప్పిపుచ్చుకోటానికి నోటీసు తెచ్చిన ప్యూన్‌ని అందులో ఏముందని అడిగి తెలుసుకుని అప్పుడు మాకు చెప్పేవారు. ప్యూన్‌కి కూడా తెలియకపోతే, ‘ఇదిగో పంతులూ, ఈ నోటీసేవిటో చదివి అర్థం చెప్పు చూద్దాం’ అని ధీమాగా అడిగి చదివించుకునేవారు. ఏదెలా వున్నా పరీక్ష పేపర్లు దిద్దటమంటే ఆయనకి మహా బద్ధకంగా వుండేది. కొంచెం తెలివైన కుర్రాడు సెలవుల్లో కనిపిస్తే చాలు, ‘పంతులూ, రేపోసారి మా యింటి వైపు వచ్చెళ్ళవోయ్’ అనేవారు. ఇంటికెళ్ళగానే బండెడు పేపర్ల కట్ట, ఒకవైపు రెడ్, మరోవైపు బ్లూ కలర్ వున్న పెన్సిలిచ్చి దిద్దమంటూ పడక్కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటుండే వారాయన. ఆ పంతులు రాసిన పేపరు మాత్రం తనే దిద్దేవారు. భోజనం టైమయితేనో, పొలం వెళ్ళాల్సి వస్తేనో, ‘పంతులు రేపు మళ్ళీ యిదే టైముకి రా’ అని చెప్పేవారు. సినిమాహాలు సందులో చివరగా వుండేది ఆయనిల్లు. స్కూలుకి హంబరు సైకిలేసుకుని వస్తుండేవారు.

ఒక విశిష్టమైన టీచరు ఆదిరాజు పున్నయ్యగారు. పున్నయ్య మేస్టారి యిల్లు రావిచెట్టు బజారులో ఆంజనేయస్వామి గుడికి యివతల. ఆయన ఉయ్యూరు స్కూల్లో ఎక్కువ కాలం పనిచెయ్యలేదు. మంటాడ, ఆకునూరు మొదలైన చోట్ల ఎక్కువ కాలం పనిచేశారు. అయినా ఉయ్యూరులో యిల్లు వుండటంతో యింటి దగ్గిర ట్యూషన్సు తీసుకుంటుండేవారు. పున్నయ్య మేస్టారు దగ్గిర లెక్కలు నేర్చుకుంటే ఢోకాలేదన్నది సత్యం. పున్నయ్యగారు తెల్లటి జుట్టుతో లావుపాటి కళ్ళద్దాలతో తెల్లటి ఖద్దరు పంచె, సగం చేతుల ఖద్దరు చొక్కా వేసుకుని మెడకి థెర్మాస్ ఫ్లాస్కు, బుజాన సంచితో అన్ని కాలాల్లోనూ గొడుగు వేసుకుని వస్తుండేవారు. వేసవికాలంలో మాత్రం ఆ గొడుగుకి నల్ల గుడ్డ మీద తెల్లగుడ్డ పొర యింకోటి ప్రెస్ బటన్సుతో తగిలించేవారు. పిల్లలకి క్లాస్ వర్క్ యిచ్చి సంచిలోంచి టిఫిను తీసుకు తని (కొబ్బరి లవుజులంటే బలే యిష్టం ఆయనకి, అవే వుంటుండేవి) ఫ్లాస్కులోంచి కాఫీని కప్పు (మూతకూడా అదే)లోకి వంచుకుని తాగేవారు.

ఆ రోజుల్లో మెట్రిక్యులేషన్ అని ఒక పరీక్ష వుంటుండేది. అది అన్ని విధాలా స్కూల్ ఫైనల్‌తో సమానం. స్కూల్లో చదవటానికి వీలుకాని వాళ్ళకి, వయసు మీరిన వారికి డైరెక్ట్‌గా మెట్రిక్యులేషన్ చేసి తరువాత కాలేజీలో చేరగల సదుపాయం అది. ఈ కాలపు ఓపెన్ యూనివర్సిటీ లాంటిదది. బెనారస్ మెట్రిక్యులేషన్ ఉత్తర

భారతదేశంలో ప్రాచుర్యంగా వుంటే, మనవైపు ఆంధ్రా మెట్రిక్యులేషన్ చాలా పాప్యులరు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారే దీనికి పరీక్షలు నిర్వహించేవారు. తెలుగు మీడియంలోనే కాక ఇంగ్లీషు మీడియంలో కూడా పరీక్షలుండేవి. ఎక్కడెక్కడినుంచో విద్యార్థులు వచ్చి పరీక్షలు రాస్తుండేవారు. సిలబస్ స్కూలు ఫైనలు పుస్తకాలే కాని మార్కులు మాత్రం ఎందుకో వంది బదులు 75కే వుండేవి. క్వొశ్చన్ పేపర్లు చాలా కఠినంగా వుంటాయని చెప్పుకునేవారు. పున్నయ్యగారు మెట్రిక్యులేషన్ చదివే పిల్లలకి రెండు మూడు సంవత్సరాల కోచింగు యిచ్చిన తరువాతే పరీక్షలకి కూర్చోబెట్టేవారు. ఆయన దగ్గిర చదువుకున్న పిల్లలు ఫెయిలవటం అరుదు. అలా ఎంతోమందికి దారి చూపించారాయన. ఫీజు యింత అని ఎప్పుడూ డిమాండ్ చెయ్యటం వినలేదు. రిటైరైన చాలాకాలం వరకూ యిలా యింటి దగ్గిర ప్రైవేట్లు చెపుతూ కాలం గడిపారాయన.

ప్రైవేటు టీచర్ల సంగతి వచ్చింది కనక యిక్కడ మరో యిద్దరి సంగతి తప్పకుండా చెప్పుకోవాలి. ఒకరు – కటకటాల మేస్టారు. ఈ మేస్టారి అసలు పేరేమిటో చాలామందికి తెలియదు, మాతో సహా. చాలాకాలంపాటు రావిచెట్టు దగ్గిర పువ్వాడ చంద్రయ్యగారి యింటికి ఎదురింట్లో వుండేవారు. పొడుగాటి వరండా ఉన్న యిల్లు. ఆ వరండాకి నిలువెత్తునా యినపచువ్వల్తో కటకటాలు. కటకటాల వెనకన పిల్లలు, పిల్లలతో మేస్టారు. చాలామంది పిల్లలు ఎలిమెంటరీ చదువు ఆయన దగ్గిరే చదువుకునేవారు. కటకటాల మూలంటా అంతా బయటకి కనిపిస్తూ సందడిగా వుండేది. కాలక్రమేణా ఆయన వేరే యింటికి మారినా ఆయన పేరు కటకటాల మేస్టారుగా స్థిరపడింది.

మరొకరు శివాలయం వీధిలో కాలేజీరోడ్డు మలుపులో వున్న సూరి వెంకటప్పయ్యగారు. ఆయన కుమారుడు సూరి పార్థసారథి. విజయవాడ ఎస్సారార్ కాలేజీలో బికామ్ పాసయి, ఉయ్యూరులోనే వుండి, ఉన్న పొలాన్ని, తల్లిని, అక్కగారిని చూసుకుంటూ ప్రైవేట్లు – ట్యూషన్లు చెప్పేవారు. విద్యార్థులు, వారి తల్లిదండ్రులు పార్థి మేస్టారు అని ఆప్యాయంగా పిలిచేవారు. పొద్దున ఏడూ ఏడున్నరకి మొదలైన ట్యూషను క్లాసులు మధ్యలో కొంత విరామంతో రాత్రి ఎనిమిదీ తొమ్మిది దాకా సాగేవి.

ఆ తరం పిల్లలకి చాలా బాగా గుర్తుండిపోయని హైస్కూలు టీచరు – అబ్దుల్ ఖాదర్. తెలుగులో యాస వుండేది కాదు. కోటు వేసుకుని టై కట్టుకుని వచ్చేవారు.





జుట్టు హిందీ నటుడు అశోక్ కుమార్ స్టయిల్లో వుండేది. సాంఘిక శాస్త్రం టీచరు. అప్పటికి మేమెవ్వరం గ్లోబు చూడకపోయినా వర్డ్ హిస్టరీ, ఇండియన్ హిస్టరీ కళ్ళ ముందు చూపినంత గొప్పగా చెప్పేవారాయన. కొన్ని విషయాలు ఆయన నోటివెంట ఎంతో బాగుండేవి । వాస్కోడిగామా గుడ్ హోప్ అగ్రాన్ని చుట్టిరావటం : మధ్యధరా సముద్రం చుట్టూ వున్న దేశాలు : విజయనగర రాజ్య వైభవం, పతనం : సైమన్ కమిషన్ : ఉప్పు సత్యాగ్రహం : మింటో । మార్లే సంస్కరణలు : భారత దేశం చివరికి సర్వతంత్ర స్వతంత్ర గణతంత్ర (సావరిన్ డెమోక్రటిక్ రిపబ్లిక్) దేశంలో ఆవిర్భవించటం – యివన్నీ ఆయన ముఖతా వింటుంటే, నేర్చుకుంటుంటే అయ్యో, క్లాసు అప్పుడే అయిపోయిందా అనిపిస్తుండేది. నూజివీడుకి చెందిన ధన్యంరాజు బ్రదర్సు – సూర్యనారాయణ, సత్యనారాయణలసాంఘిక శాస్త్రం పుస్తకాలు చాలా బాగుండేవి. ఆ రోజుల్లో ఆయన మోస్ట్ పాప్యులర్ టీచరు. స్కూల్స్ ఇన్స్పెక్టరు పరీక్ష రాసి వుత్తీర్ణులైనారాయన. దాంతో వేరే చోటికి వెళ్లాల్సి వొచ్చింది. ఆయనకి వీడ్కోలు యిచ్చేందుకు పొద్దునే ఎనిమిది గంటకలంతా స్కూలు పిల్లలు మొత్తం సెంటరుకొచ్చారు. అప్పటికింకా బస్సులు ప్రైవేటు యాజమాన్యంలోనే వుండేవి. డ్రైవరు పక్కన రెండు సీట్లు ఎప్పుడూ సంఘంలో పెద్దలకో, హోదా ఉన్న వాళ్లకో ఉండేవి, ఫ్రంట్ సీట్లో కూర్చోడం, కూర్చోపెట్టడం సాంఘిక మర్యాద, గౌరవం. ఆ రోజున అబ్దుల్ ఖాదర్ గారికీ జై అంటూ జయజయధ్వానాల మధ్య ఆయనకి వీడ్కోలు పలుకుతుంటే ఖాదరుగారు కనుకొలకుల్లో చిమ్మిన నీరుని తుడుచుకుంటూ మాటలు రాక గద్గద స్వరంతో విద్యార్థులందరి వంకా మూగబోయి చూడటం, వాళ్ళూ అదే స్థితిలో వుండటం – కులమతాలకి అతీతంగా వున్న ఆనాటి సమాజానికి దర్పణం.

***అందరూ మహానుభావులే.***

* * *

## తోటలో చెప్పొచ్చారా?

పెళ్ళిళ్ళకి, వొడుగులకి, మరితర శుభకార్యాలకి పిలుపులు మొదలవుతుండగానే యింట్లో ఎవరో ఒకరు తోటలో చెప్పొచ్చారా? అని అడగటం పరిపాటి. తోటలో చెప్పటం ఏమిటని బయట వాళ్ళకి అనిపిస్తుండవచ్చు. శివాలయం వీధికి వివరున్న రేవు దగ్గిర (ఇపుప్పడక్కడ వంతెన వచ్చింది) కాలవగట్టు వెంబడి పడమరగా నడుస్తూ పోతే ఫర్లాంగు దూరంలో చిన్న వంతెన వస్తుంది. దాన్ని దాటి యాకమూరు వెళ్ళే దారిలో కొంచెం ముందుకు పోతే ఎడమ పక్కన చక్కని పంటచేల మధ్యలో గాయత్రి అనంతరామయ్యగారి తోట ఉండేది. సుమారు పది పన్నెండెకరాల పొలాల మధ్యన తోట వేసుకుని దాంట్లోనే సిమెంటు రాయి గోడల మీద రెల్లుగడ్డి పరిచిన పర్ణశాల లాంటి యిల్లు ఆయనకుండేది. రోడ్డు లేకపోవడంతో చేల గట్టు మీదనుంచే వాళ్ళ యింటికి చేరుకోవాలి. వానాకాలంలో బురద అంటుకుంటే యింటి బయటే కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళ తొట్టె సదుపాయం వుండేది. శుభకార్యాల పిలుపులికి సన్నాయి మేళంతో వూళ్ళో యింటింటికీ శుభలేఖలు పంచుతూ, ఆడవాళ్ళకి బొట్టు పెట్టి పిలవడం ఆనవాయితీ. అయితే తోటలో పిలుపులికి మాత్రం మేళం లేకుండా వెళ్ళి పిలవటమే అనువుగా వుండేది. జట్కాలు పోయి సైకిలు రిక్షాలు వొచ్చిన తరువాత చిన్న వంతెన మీద నించి అవి వెలుతుండేవి. వంతెన ఎత్తులో వుండటంతో రిక్షా వాళ్ళు దిగి దాన్ని తోయాలి. అలా వూరికి దూరంగా వుండేవారాయన.

గాయత్రి అనంతరామశాస్త్రిగారిని అనంతరామయ్యగారు అనడమే పరిపాటి. అనంత రామయ్యగారు ఆజాను బాహువు కాకపోయినా పొడుగ్గా తగినంత లావుటా దారుఢ్యంగా వుండే వారు. శరీరం పచ్చని పసిమి. తెల్లటి సన్న నూలు పంచ కట్టుకుని, బుజాల్ని అంతే తెల్లటి వుత్తరీయంతో అడ్డంగా ఆచ్ఛాదించుకుని, ముఖాన వీభూతితో దాదాపు రోజూ పొద్దునో సాయంత్రమో నడుచుకుంటూ వూళ్ళోకి వస్తుండేవారాయన. ఆయనలా నడిచొస్తుంటే ఏదో మునిపుంగవుడు దారి తప్పి పొరపాటున యిటు వస్తున్నాడా అన్న అనుమానం కలుగుతుండేది. ఎవరన్నా పలకరిస్తే మాట్లాడేవారుకానీ, ఆయనంతట ఆయన ముచ్చట్లాడటం చాలా తక్కువ – వరసకి మేనల్లుడైన వంగల కృష్ణదత్త శర్మగారితో తప్ప. అనంతరామయ్యగారు చొక్కా వేసుకుని వూళ్ళో కనిపించారంటే దాని అర్థం ఏదో వూరు వెళుతున్నారనే.





ఆయనొక విజ్ఞాన ఖని అన్న సత్యాన్ని చాలా ఆలస్యంగా గుర్తించాం మేము. ఆయన్ని పలకరించటానికే జంకు మాకందరికీ. ఒకసారి దాన్ని అధిగమించిన తరువాత ఆయన మస్తిష్కంలో ఎన్నెన్ని విశేషాలు దాగున్నాయో, దాచుకున్నారో విశదమవుతుండేది. వేదవేదాంగాలతో బాటు ఇంగ్లీషు, తెలుగులో వున్న వుత్తమోత్తమ గ్రంథాలు కూలంకుషంగా, విమర్శనాత్మకంగా చదివి వంటబట్టించుకుని వాటి సారాన్ని అడిగిన వాళ్ళకి సులభంగా, తియ్యగా విశ్లేషించి చెప్పటం ఆయన గారి గొప్పదనం. అలా సముపార్జించుకున్న బహుముఖ పరిజ్ఞానాన్ని అడగని వాళ్ళకి కూడా పంచిపెట్టకపోవటం బహుశా ఆ నిగర్వి జీవితంలోని చిన్న లోపం అని యిప్పుడనిపిస్తుంది. లేదా వూరు ఆయన్ని సరిగా ఆదరించలేదేమోనని కూడా అనిపిస్తుందిప్పుడు. కేవలం దత్తుగారింటికి వచ్చినప్పుడే మాతో చనువుగా ఎన్నో విశేషాలు తెలియపరుస్తుండేవారు. బహుశా ఒక తరం ఆలశ్యంగా ఆయన జన్మించి వుంటే వారి వైశిష్ట్యాన్ని ఉయ్యూరు సమాజం సంపూర్తిగా ఉపయోగించుకుని వుండేదని నా విశ్వాసం.

ఇంతకీ అన్ని విషయాలు కూలంకుషంగా తెలిసి, ఛాందసాలకి వ్యతిరేకి అయిన అనంతరామయ్యగారు అందర్లా తద్దినాలు వంటి రిచువల్స్ పాటిస్తారా అని ఎందుకో అనుమానం వచ్చింది. ఓసారి వాళ్ళింటికి తద్దిన భోక్తగా వెళ్లిన వ్యక్తి చెప్పిన ప్రకారం – సంస్కృతం అర్థం కాని భోక్తల దగ్గిర ఆ మంత్రాలు వల్లించి ప్రయోజనం లేదనే వుద్దేశ్యంతో ప్రత్యామ్నాయంగా ఆ మంత్రాల అర్థాలని ఆయన తెలుగులోనే చెబుతూ కార్యక్రమాన్ని నడిపించేవారట. ఆయన ఎంత సనాతంగా కనిపించినా మంచి పురోగామి.

మొత్తం నలుగురు అన్నదమ్ముల్లో అనంతరామయ్యగారు ఒకరు. వారింటి పేరు కొలచల. అనంతరామయ్యగారిని గాయత్రి వారు దత్తత తీసుకున్నారు. అనంతరామయ్యగారెంత గొప్పవాడలో ఆయన తమ్ముడు కొలచల సీతారామయ్యగారు అంతే గొప్ప. సీతారామయ్యగారు పెద్ద చదువులు చదవాలనే కోరికతో చిన్నప్పుడే యిల్లు వదిలిపెట్టి బొంబాయి చేరి అక్కడి నించి ఓడనెక్కి విదేశాలకి వెళ్లారట. అమెరికాలో చిన్న చిన్న పనులు చేస్తూ సంపాదించి చదువుకుని ఆయిల్ టెక్నాలజీలో డాక్టరేట్ పొంది, ఆయిల్ టెక్నాలజిస్టులు తక్కువుగా ఉన్న సోవియట్ రష్యాకి చేరి ఆ దేశపు ప్రముఖ శాస్త్రజ్ఞుడిగా, టెక్నాలజిస్ట్‌గా గుర్తింపు పొందారు. అక్కడే వివాహం చేసుకుని స్థిరపడ్డారాయన. దాంతో కొలచల సీతారామయ్యగారు – కాన్స్టాంతిన్ సెర్జియేవిచ్‌గా

మారి రష్యన్ సిటిజన్ అయ్యారు. దేశం దాటితే చాలు కుటుంబంతో సహా వెలి వెయ్యటం జరుగుతుండే రోజుల్లో జరిగిందిది. తమ్ముడైన సీతారామయ్యగారి గురించి అనంతరామయ్యగారి చెప్పిందల్లా రష్యా నించి ఆయన తెలుగులో రాసే వుత్తరాల్లో రష్యన్ బాష భారతీయ భాషలకి ఎంతో దగ్గిరని, ఎన్నో సంస్కృత పదాలు ఆ భాషలో వున్నాయని సోదాహరణంగా చెబుతుండేవారు. సీతారామయ్యగారిని గురించి మొదటిసారి పూర్తిగా ఉయ్యూరు ప్రజలు తెలుసుకున్నది – 1950 దశకంలో ఆయన్ని గురించి కుటుంబ ఫొటోలతో సహా విశాలంధ్ర వారు పంపిణీ చేసే సోవియట్ భూమిలో ప్రచురించిన వ్యాసం వల్ల.

నలభై రెండు సంవత్సరాలు విదేశాల్లో గడిపి ఆ తరువాత మొట్టమొదటి సారి స్వదేశానికి, స్వగ్రామానికి వచ్చిన (1962–63) సందర్భంలో మేమంతా వీరమ్మగుడి దాటి పొలిమేర దగ్గిర నాదస్వరంతో వేదోక్తంగా పూర్ణకుంభంతో స్వాగతం చెప్పిన వుదంతం బాగా గుర్తు. (నోరి వెంకాయమ్మగారి కొడుకు రిజర్వు బ్యాంకుకి డిప్యుటీ గవర్నరుగా నియమితులై ఉయ్యూరు వచ్చిన సందర్భంగా యిదే రీతిలో పొలిమేర వద్ద స్వాగతం చెప్పి వూరేగిస్తూ వూళ్ళోకి తీసుకురావటం జరిగింది). అక్కడినించి ఆయన అదే కారులో పెద్ద వంతెన మీదనుంచి కాలువ దాటి అనంతరామయ్యగారి యింటికెళ్లి అన్నగారి దగ్గిర కొన్ని రోజులపాటు వున్నారు. ఆయన్ని ఇంటర్వ్యూ చెయ్యటానికి శ్రీమతి మాలీ చందూర్ వచ్చారని తరువాత ఆవిడ రాసిన వ్యాసంలో తెలిసింది. ఆయన స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడుతుంటే మాలతీ చందూర్ మాటల్లో కొన్ని ఇంగ్లీషు పదాలు దొర్లిన సమయంలో, 'ఎందుకమ్మ, హాయిగా మన మాతృభాషలో మాట్లాడకుండా పంటి కింద రాయిలా ఆ పదాల్ని వాడుతున్నావు?' అని అడిగారని ఆమే రాశారు. అదీ మాతృభాష మీద ఆయనకున్న మమకారం– నలభైరెండు సంవత్సరాలు విదేశాల్లో గడిపిన తరువాత కూడా.

సీతారామయ్యగారి మనుమరాలు (సినిమా టైటిల్‌కాదు!) అనస్తాషియా తన మూలాల్ని వెదుకుంటూ అయిదారేళ్ళ కిందట తాతగారి స్వగ్రామమైన ఉయ్యూరు వెళ్లి – ఎప్పుడూ చూడని, కలవని బంధువుల్తో కొంతకాలం గడపటం మరో విశేషం. తమ వంశానికి మూలపురుషుడని చెప్పుకునే కుంటా కింటే అన్న ఆఫ్రికన్‌ని ఎత్తుకొచ్చి ఏడుతరాల కిందట బానిసగా అమెరికాలో అమ్మినట్టు వంశపారంపర్యంగా చెప్పుకుంటూ





వస్తున్న పూర్వీకుడి వుదంతం అలెక్స్ హైలీ అనే నల్లజాతికి చెందిన అమెరికన్ రికార్డులన్నీ పరిశీలించి, ఆఫ్రికాలో వెదికి తన జ్ఞాతుల్ని కలుసుకున్న వైనం రూట్స్ అనే పుస్తకంలో విశదీకరిస్తూ రాసింది గుర్తుకొస్తుంది ఎవరికైనా.

ఇంతకీ గాయత్రి అనంతరామశాస్త్రిగారు అంతటి విజ్ఞాన ఖని అయుండి తన జ్ఞానాన్ని నలుగురికీ ఉపయోగపడేలా పంచకపోవటం మిస్టరీ. ఆయనలో ఉన్న ప్రతిభని గుర్తించి ఉయ్యూరు ప్రజలు ఉపయోగించుకోకపోవటం అంతకన్నా పెద్ద మిస్టరీ. ఆయనకి మనవడి వరసైన విద్యాసాగర్ ప్రకారం కుటుంబానికి చెందిన దగ్గిర వాళ్ళు కొంత నేర్చుకున్నారట. వాకిట్లో ముగ్గులెందుకు వేస్తాం, కంచం చుట్టూ నీళ్ళెందుకు తిప్పుతూ చల్లుతాం లాంటి చిన్నచిన్న ఆచారాలు, పద్ధతుల వెనకున్న మర్మాల్ని చివరి దశలో హైదరాబాద్‌లో గడిపిన రోజుల్లో మనవళ్ళని, మనవరాళ్ళని వొళ్ళో కూర్చోపెట్టుకుని చెపుతుండే వారట. ఆయన్ని గురించి ఒక్క వాక్యంలో చెప్పాలంటే – దిస్ వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా వజ్ మచ్ అండర్ రేటెడ్ అండ్ ప్రాబబ్లీ మచ్ లెస్ అండర్‌స్టుడ్ అండ్ యుటిలైజ్డ్ ! బహుశా దానికి కారణం వూరవతల వూరి ప్రజలకి దూరంగతా తోటలో వుండటమేనేమో!

## దత్తుగారి దాతృత్వం

గాయత్రి ఈఅనంతరామయ్యగారిని గురించి చెప్పుకున్న తరువాత దత్తుగారిని గురించి చెప్పుకోవటం తప్పదు. అనంత రామయ్యగారిని ఎంతో కొంత తెలుసుకున్నది కేవలం దత్తుగారి వల్లనే. దత్తుగారెప్పుడూ పరోక్షంలో కూడా ఆయన్ని పేరుతో చెప్పకుండా కేవలం మామయ్య అనే వ్యవహించేవారు. దత్తుగారి పూర్తి పేరు వంగల కృష్ణదత్త శర్మ. శివాలయం విధిలో కోట దాటిన తరువాత ఎడమపక్కనుంది అయన ఇల్లు. ఆయన భార్య శ్రీమతి శ్యామలాదేవి ఆరోజుల్లోనే సైకాలజిలో ఎమ్.ఎ. చేసి బనారస్ హిందూ యూనివర్సిటీలో లక్చరరుగా పనిచేసేవారు. వాళ్ళకొక అబ్బాయి, పేరు గోపి. తల్లి, కొడుకు ఉయ్యూరులో ఎప్పుడూ వుండేవారు కారు కనక దత్తుగారి సంసార జీవనం అంతంత మాత్రమే. ఈయన పొలాలు చూసుకుంటూ వంట మనిషిని పెట్టుకునో, హోటల్లో భోజనం చేస్తూనో కాలం గడుపుతుండేవారు. చిన్నప్పుడు వేసవి సెలవల్లో గోపి వచ్చి నెలా, రండు నెలలు గుడుపుతుండేవాడు. అతనొస్తే దత్తుగారికి ఎంత పండగో మాకు అంతే. గోపీ కోసం దత్తుగారు క్యారం బోర్డు కొన్నారు. మరి క్యారమ్సు గోపి ఒక్కడే ఆడుకోలేడు కదా, అందుకని మేమంతా వెళ్ళి అక్కడ అడుకునేవాళ్ళం. ఆ చనువుతో గోపి తిరిగి వెళ్ళిపోయినా మేమందరం దత్తుగారింటికెళ్ళి ఆడుకునే వాళ్ళం. ఆయన బయటికిల వెడుతుంటే ఏకంగా బోర్డుని యింటికే తెచ్చి పెట్టుకుంటుండేవాళ్ళం. చివరికి ఎలాంటి స్థితి వచ్చిందంటే క్యారం బోర్డు పర్మినెంటుగా మా యిళ్ళల్లోనే వుండిపోతుండేది. దత్తుగారు ఏమీ అనేవారు కాదు. అనలేకపోయేవారు కూడా, అంతటి మృదుభాషి ఆయన.

దాతృత్వంలో కూడా ఆయనకి ఆయనే సాటి. అడిగన వాళ్ళకి లేదనే స్వభావం ఎప్పుడూ అబ్బలేదాయనకి. ఉయ్యూరు హైస్కూలుకి కీర్తిశేషురాలైన చెల్లెలి జ్ఞాపకార్థం పెద్ద విరాళం ఇచ్చిన సంగతి ముందు చెప్పుకున్నాం. ఒకసారి సెలవల్లో ఆయన శ్రీమతి వచ్చారు. ఆవిడ వున్నన్ని రోజులూ మేమాయింటి ఛాయలక్కూడా పోయేవాళ్ళం కాదు. ఆవిడ రానిచ్చేది కాదు కూడా. ఆ సమయంలో భర్త దత్తుగారి నిత్య దాతృత్వాన్ని చూసి నచ్చక సావిట్లో గుంజకి – ఇక్కడ దానములు చేయబడవు అని అట్టముక్క మీద పెన్నుతో రాసిన బోర్డొకటి వేలాడదీయించిందావిడ (ఆవిడ వూళ్ళోకి దిగారన్న సంగతి తెలియక అలవాటుకొద్దీ అర్థించటానికి వెళ్ళిన వాళ్ళు వూళ్ళో చెప్పగా బయటపడిందది). అది ఆవిడ వున్నన్నాళ్ళు సాగేది. ఆ తరువాత చేతికి ఎముక లేని ఆ వదాన్యుడి పద్ధతి మళ్ళీ మామూలే.





దత్తుగారంటే ఎన్నెన్నో గుర్తుకొస్తాయి. ముందుగా గుర్తుకొచ్చేది – బాలభారతి. మాకందరికీ పాటలు, పద్యాలు, నాటికలు నేర్పించారు. ఒకసారి మైలవరం తీసుకెళ్ళి అక్కడి బాలభారతిలో మాచేత నాటకం వేయించారు. బాలానందం రేడియో అన్నయ్య గారిని పిలిపించి రంతిదేవుడు అన్న రూపకాన్ని మా బృందంలో రికార్డు చేయించారు. ఆయనగారి స్వంత లైబ్రరీలో ఎన్నెన్నో గొప్ప గొప్ప పుస్తకాలుండేవి. ముద్దుకృష్ణ సంకలనంలో వచ్చిన వైతాళికులు పుస్తకాన్ని ముందుగా ఆయనింట్లోనే చూశాము. కమ్యూనిష్టు పార్టీలో సభ్యుడిగా వుండటం, తరువాత కాలంలో ఆ పార్టీ ఆయన్ని బయటికి పంపించటం, దానికాయన లేఖా రూపంలో తన గురించి సమర్థన, చివర్లో యీ కారణం వల్లనే నేనే పార్టీ నించి నిష్కాసితుడినయ్యాను (యక్స్‌పెల్లిడ్ అన్న ఆంగ్ల పదానికి అందమైన సంస్కృత – తెలుగు పదం) అంటూ ముగించటం – యివన్నీ మాకు చూపించారాయన. ఆయన మూలానే మాకు మహాప్రస్థానం, త్వమేవాహం, కరుణశ్రీగారి పుస్తకాలు పరిచయమైనాయి – రాసుకుంటూ పోతే ఇలా లెక్కలేనన్ని.

స్వతంత్రం రాగానే బ్రిటిష్‌వాళ్ళు మన దేశాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయినా పోర్చుగల్‌కి కాలనీగా వున్న గోవా వైపుకి పంపించింది. పోర్చుగీసుల కళ్ళు కప్పి గోవాలోకి బలవంతంగా దూరి మన త్రివర్ణ పతకాన్ని అక్కడ ఎగరెయ్యటం వారి ముఖ్య వుద్దేశ్యం. వారిలో ఉయ్యూరుకి చెందిన సూరి శోభనాచలపతి గారబ్బాయి సూరి రామం ఒకడు. అప్పుడతను ఇంటర్మీడియట్ స్టూడెంటు. ఒకసారి ఏదో ఫంక్షను సందర్భంగా మా ఇంటికి వచ్చినప్పుడు బ్రతుకు తెరువు సినిమాలోని అందమె ఆనందం ఆనందమో జీవత మకరందం అన్న పాటని చక్కగా పాడి వినిపించారు. గోవాలో చొరవపడనీయుండా పోర్చుగీసువాళ్ళు జరిపిన కాల్పుల్లో యిద్దరు మరణించారు, వారిలో సూరి రామం ఒకడు కావటం విషాదం. ఆతని స్మృతి చిహ్నంగా శిలా విగ్రహాన్ని ప్రతిష్టించాలని ఉయ్యూరు గ్రామస్తులు నిర్ణయించారు. విరాళాలు మూడువేల రూపాయలు దాటాయి. మరి విగ్రహం ఎవరు చేయించాలి? ఎక్కడ ఎక్కడుంచాలి? అతన్ని పోషించాలి? ఈ ప్రశ్నలకి కూడా జవాబులు – దత్తుగారు, దత్తుగారు, దత్తుగారు.

యింత లావున రాజకీయ నాయకుడి విగ్రహంలా తయారైందది. అయితే అతని తప్పు కూడా లేదందులో. కేవలం ఒక కేబినెట్ సైసు బస్టు ఫోటోని చూస్తూ మేమిచ్చిన కొన్ని వివరాలతో చెక్కాడతను. అందరూ తిట్టారు, కొట్టబోయారు కూడా. అప్పుడు మళ్ళీ వులి, సుత్తి తీసుకుని గబగబా చెక్కుకుంటూ పోయాడు. రెండు మూడు

నెలల్లో విగ్రహం తయారుకావటం, చారిగారికి వుద్వాసన చెప్పటం, కుమార్రాజు (శ్రీ ఎం. ఆర్. అప్పారావు, ఎం. ఏ) వారిని పిలిపించి ఆవిష్కరింపచేయటం చకచకా జరిగాయి. దత్తుగారి ఆతిధ్యం అలాంటిది మరి!

దత్తుగారి దినచర్చ గురించి చెప్పుకోవాలి. కాలకృత్యాలు పూర్తి అయేలోపల రామదాసు అనే యింటి మంగలి రోజూ తలంటు పొయ్యడానికి వచ్చేవాడు. సరదాకి మేము ఆస్థాన మంగలి అని అతన్ని అంటుండే వాళ్ళం. స్నానాదికాలు పూర్తి కాగానే పునుగూ, జవ్వాజి రాసుకుని ఖద్దరు బట్టలేసుకుని తొమ్మిది గంటలకల్లా బయటికొచ్చేవారు. నడుచుకుంటూ దారిలో కనబడ్డ వాళ్ళందర్నీ పలకరిస్తూ హోటల్లో టిఫిను ముగించుకుని సైకిలు మీదో, రిక్షాలోనో పొలాలు చూసుకునొచ్చేవారు. భోజనం చేసి కాసేపు విశ్రాంతి తీసుకుని సాయంత్రం గూడెం వైపునున్న పొలాలకి వెళ్ళొచ్చేవారు.ఆయన యింట్లో బ్రిటిష్ పై రేడియో వుండేది. రాత్రి తొమ్మిది గంటలకి ఇంగ్లీషు న్యూస్ వినేవారు.

దత్తుగారికి మాటలు తడబడేవి. దాంతోపాటు అప్పుడప్పుడు నత్తి. వీటిని అధిగమించాలనే ప్రయత్నంలో మూతి కూడా కొంచెం వంకర పోతూండేది. తమాషాగా కనిపిస్తుండేది. అందుకని ఆయన మొహాన్నే చూస్తూ వినబడనట్టు నటించేవాళ్లం. మళ్లీ ఆయన అంత ఓపిగ్గా చెబుతుంటే ఆయన ముఖ కవళికల్నే చూస్తూ లోపల్లోపలే నవ్వుకుంటుండే వాళ్ళం. ముఖమంతా స్ఫోటకం మచ్చలుండేవి. గొంతు చాలా సన్నది. ఇవన్నీ కలుపుకుని చాలామంది చేత పరిహాసాల పాలవుతుండే వారాయన.

ఆయన ఇల్లు సెలవుల్లో మాకు మరో బడి. ఆయన చెప్పే విషయాలు వినడం ఒక నిత్యకృత్యం మాకు. ఒక తరం పిల్లలకి ఆయనెంతో స్ఫూర్తినిచ్చారు. ప్రోత్సాహించారు. కాలక్రమేణా జీవితంలో వాళ్ళు ఎదగటం చూసి ఆయన పొంగిపోయే వారు. తన సంసారిక జీవనంలో కలిగిన లోటుపాట్లని పట్టించుకోకుండా తన చుట్టుపక్కలున్న వాళ్లు అభివృద్ధి చెందితే తన పిల్లలే పైకొచ్చినట్టు తనకే స్వంతమైన వంకర మూతితో చిరునవ్వు చిందిస్తూ సాగిపోతుండే వారాయన. ఆయనకున్న జిజ్ఞాస, విషయ పరిజ్ఞానం, దాతృత్వం, చిన్న పిల్లలతో సైతం గౌరవంగా మాట్లాడే స్వభావం, చీమకి కూడా అపకారం చెయ్యక పోవటం, అసలు అలాంటి పని చేయాలని కూడా అనిపించకపోవటం వంటి వుత్తమోత్తమ గుణాలు మరెవరిలో కనిపించవు. ఉయ్యూరు గ్రామస్తులు ఆయనగారి వదాన్యతని విశేషంగా చెప్పుకున్నా, పరోక్షంగా ఆయన్ని హేళనకి గురి చెయ్యటం ఒక మచ్చగా మిగిలిపోతుంది.





## శివరాత్రికి విందు భోజనాలు

శివరాత్రి అంటే రోజల్లా వుపవాసం, అభిషేకాలు, రాత్రంతా జాగరణ వగైరాలతో ముడిపడి వుంటుంది కదా! మరి విందు భోజనాలేవిటండీ అంటున్నారా? అదొక అంతరించిన సంప్రదాయం– తోట్లవల్లూరులో. కాలవకి అవతల ఉయ్యూరుకి పడమరగా నాలుగు మైళ్ల దూరాన కృష్ణానది ఒడ్డున వుంది తోట్లవల్లూరు గ్రామం. ఆరోజుల్లో ఉయ్యూరునించి వెళ్లే బస్సు రూట్లు ముచ్చటగా మూడే. బెజవాడ–బందరు (ఇదే తరువాత విజయవాడ–మచిలీపట్నం అయింది), మేడూరు–గన్నవరం, విజయవాడ–తోట్లవల్లూరు. కొంత కాలానికి కాటూరు మీదనించి ఉయ్యూరు – తేలప్రోలు మొదలైంది. 1957లో బస్సుల్ని జాతీయం చేసిన తరువాత కూడా చాలా కాలం పరిస్థితి యిలానే వుండేది. తోట్లవల్లూరులో పాడుపడిన కోట ఒకటుంది. దానికి రాజెవరో ఆయన పేరేమిటో తక్కువ మందికి తెలుసు. కాని ఆయన కుక్కల్ని బాగా పోషిస్తుండేవారట, అందుకని కుక్కలరాజాగానే ప్రసిద్ధుడాయన. బందరు కేకినీ మహల్లో (రామానాయుడు పేట సెంటర్లో చిన్న కోటలాంటి భవనం) వారి సంతతి వుండేవారని చెప్పగా విన్నాను.

ఎలిమెంటరీ స్కూలు టీచరు పెద్దిభొట్ల వెంకటేశ్వర్లుగారబ్బాయి ఆదినారాయణ మాతో కలిసి చదువుకుంటుండేవాడు. అతని చదువు, పడక మా యింట్లోనే. మామీద అతని ప్రభావం కూడా కొంత వున్నందుకు అతన్ని గురించి మరోసారి వివరంగా చూడొచ్చు. ఆదినారాయణకి తోట్లవల్లూరులో బంధువులున్నారు. అప్పుడప్పుడు నడిచి వెళ్ళి తిరిగొస్తుండే వాడు. బస్సు వున్నా, ఛార్జి పావలానే అయినా అంతమాత్రం డబ్బు ఖర్చు పెట్టటం ఆరోజుల్లో చాలా మందికి యిబ్బందిగా వుండేది. ఎందుకంటే – పావలా (రూపాయలో నాలుగోవంత, 25 పైసలు) పెడితే ముఖ్యంగా కాయ (పొడుగాటి సీసా నిండా, 750ఎం. యల్. ) కిరసనాయిలు, సవాశేరు (350 గ్రాములు) పంచదార లాంటి ముఖ్యావసరాలకి పనికొస్తుండేదది. ఒకసారి ఆదినారాయణ మా అన్నయ్యని, సూరి నరసింహాన్ని తోట్లవల్లూర్లో శివరాత్రి వుత్సవాలకి తీసుకెళ్ళాడు. తీసుకెళ్ళాడంటే అర్థం – కలిసి నడిచెళ్ళారు. నన్ను పోనీయలేదు యింట్లో – నాలుగు మైళ్ళు నడవటానికి గంట పైన పడుతుందని, నేను వాళ్ళ కన్నా చిన్నవాడినని. తిరిగొచ్చిన తరువాత ఆ సంగతులు వింటుంటే నోట్లో నీళ్ళూరేవి. అందుకని మరుసటి సంవత్సరం పట్టుబట్టి నేను కూడా వాళ్ళతో వెళ్ళా.

శివరాత్రికి ఒకరోజు ముందే సాయంత్రం పెందరాళే భోజనం చేసి చిన్న వంతెన దాటి చీకట్లో కంకరరోడ్డు మీద నడవటం మొదలెట్టాం. చేతిలో చిన్న సంచీ మాత్రమే వుంది. అందులో ఒక జత బట్టలు, తువ్వాల మాత్రం. సబ్బు, దువ్వెన, టూత్ బ్రష్ వగైరాలు అక్కర్లేదు. అమావాస్యకి ముందురోజులు కావటంతో వెన్నెల లేదు, దీపాలు అసలే లేవు. టెలిఫోను స్థంభాలూ, వాటిమీద పింగాణీ గువ్వలు వుండేవి కాని కరెంటు స్థంభాలు యింకా రాలేదు. నక్షత్రాలు వెలుగులో ఆ రోడ్డు మీద నడుస్తూ చేసిన ప్రయాణం మరుపురానిది, మరవలేనిది (ఓసారి మహారాష్ట్రలో పాంచ్ గావ్ – అయిదు వూళ్లు – అనే చోటికి పెళ్ళికి వెళ్ళాం ఆఫీసులో కొంతమందితో, నాగరికతకి ఆ వూరు ఎంతో దూరంలో వుంది, కరెంటు కాదుగదా పెళ్లికి పెట్రొమేక్స్ లైట్లు కూడా లేవు. ఆ రాత్రి మాకు ఆరుబయట నేల మీద కంబళ్లతో పక్కలు. అర్ధరాత్రి మేలుకొని చూస్తే మామూలుగా కనపడే నక్షత్రాలు దేదీప్యమానంగా వెలుగుతూ కొన్ని పెద్ద పెద్ద బంతుల్లా మరికొన్ని నిమ్మకాయలంతగా ఆకాశం నించి తోరణాలు కట్టి వేలాడతీసినట్టు కనిపించిన అనుభూతి మరో గొప్ప విశేషం).

ఆదినారాయణ వుంటే కాలక్షేపానికి కొదవ వుండదు. పద్యాలు పాడటం, హరికథలు చెప్పటం మీద చాలా వుత్సాహం వుండేదతనికి. పైగా మంచి గాత్రం కూడాను. రెండు మైళ్ళు దాటంగానే నాగులేరు వొస్తుందయ్యా, అక్కడ కాసేపు రెస్టు తీసుకుని వెడదాం అని చెప్పాడు మా గైడ్ ఆదినారాయణ. నాగులేరు రాగానే – చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు, నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు అంటూ పాడాడు. అది పేరుకి ఏరే కాని ఒక్క చుక్క కూడా నీళ్లు లేవందులో. నాపరాళ్లు కాదు బండరాళ్లు కోకొల్లలు.

తోట్లవల్లూరులో పోస్టాఫీసుండేది కాదు. అందువల్ల వుత్తరాలు, మనియార్డర్లు, పార్సిళ్ళు వగైరాలన్నీ ఉయ్యూరు పోస్టాఫీసు నుంచి కాలినడకన ఒకతను తీసికెళ్ళి అందించి మళ్ళీ సాయంత్రానికల్లా తిరగొస్తుండేవాడు. చేతులో పొడుగాటి బల్లెం – బలిశం అని కూడా అంటారు. పట్టుకుని నడుస్తూ తపాలు వున్న కేన్వాసు సంచిని బుజం మీదుగా వీపుకి వేసుకుని మోసుకుంటూ వెడుతుండేవాడు. ఆ పనికి జీతం రోజుకి పావలా అని ఎవరో చెప్పారు, అదీ పావలా విలువ. అక్కడికి చేరగానే సరిగ్గా ఆ వ్యక్తి గుర్తుకొచ్చాడు. ఒక్కరోజు నడవటానికి కష్టంగా వుంటే, మరి రోజూ అతను





ఎండనక, వాననక ఎలా వెళ్ళి సాయంత్రానికల్లా తిరిగొస్తాడో అనిపించింది. అలా సాగిన ప్రయాణం మరో గంటలో చీకట్లో రోడ్డుకి కుడివైపున కరి కళేబర ములా నల్లగా భూతంలా వున్న తోట్లవల్లూరు కోట కనబడగానే ముగింపుకొచ్చింది.

ఆదినారాయణ వాళ్ళ బాబాయిగారింటి వరంగా ఆరుగులమీద పడుకున్నాం వొళ్ళు తెలీకుండా. మర్నాడు కృష్ణా నదిలో స్నానం. తోట్లవల్లూరులో కృష్ణా నదికి రెండు పాయలున్నాయి. వూరికి దగ్గిరున్న పాయలో నీళ్ళు లేకపోతే మధ్యలో ఇసుక మేటలున్న లంక దాటుకుని రెండో పాయలో స్నానం ముగించాం. రెండురోజులూ అదే చేశాం. గుడి చుట్టూ విశాలమైన తాటాకు పందిళ్ళు వేశారు. ఆరుబయట స్టేజి కట్టారు. మొదటిరోజు రాత్రి కూచిపూడి వారు ఉషాపరిణయంవేశారు. శ్రీ వెంపటి సత్యనారాయణ ఉషాసుందరి. అర్ధరాత్రి ఎవరో ఆగంతుకుడు అంత:పురంలోకి చొరబడి ఉషాసుందరిని కలిశాడని తెలిసిన రాజుగారు సేవకులని విచారిస్తాడు. వాళ్లప్పుడు – ఆ మందిరములో, ఈ మందిరములో ఉషాసుందరి శయనించు చుండగా మేమందరమూ మేమిందరమూ, మనమందరమూ మనమందరమూ, అని మళ్ళీ మళ్ళీ అదేపనిగా అంటూ, చాలా సేపు సాగుతుండటం గుర్తు, రెండోరోజు అబ్బూరి వరప్రసాదరావు కృష్ణుడిగా నటించిన పాండవోద్యోగ విజయాలు నాటకంలో రాయబారం సీను వేశారు. అబ్బూరి వరప్రసాదుగారి రాయబారం పద్యాలు మొదట విన్నది మిత్రుడు ఆదినారాయణ నించే. ఆ తరువాత ఎలెక్షను మీటింగుల్లోనూ, పెళ్లి పందిళ్ళలోనూ గ్రామఫోను రికార్డులు వింటుండేవాళ్ళం. తిరుపతి వెంకటకవులు నాటకాన్ని సామాన్య ప్రజానీకానికి దగ్గిరకి తెచ్చి ఎలా లబ్ధప్రతిష్టుయ్యారో, శ్రీ అబ్బూరి వరప్రసాదు స్టేజిమీదా, గ్రామఫోన్ రికార్డులతో మరింత దగ్గరికి తేవటం తెలుగువాళ్ళ అదృష్టం. మా పాలేరు అప్పలసూరి పేడ కలుపుతూ, గోడకి పిడకలు కొడుతూ ఈ పద్యాలన్నీ తనకొచ్చిన రాగంలో పాడుకోటం ఒక ఉదహరణ. పెట్రొమేక్స్ లైట్లలో సరైన స్టేజి లేకుండా వున్నా ఆయన అప్పుడు పాల్గొనటం, మేము మొదటిసారిగా చూసిన పౌరాణిక నాటకం అదే అవటం మా అదృష్టం కూడా.

ఈ వుత్సవాలు అంత ఘనంగా అన్ని రోజులపాటు వ్యయ ప్రయాసలకి వెనకాడకుండా కొంతకాలంపాటు నిర్వహించిన ఘనత – యింతలావుపాటి వెండి శివలింగాన్ని జంధ్యానికి వేలాడతీసుకున్ని పండిట్లో అందర్నీ పలకరిస్తూ హడవిడిగా

తిరుగుతున్న శ్రీ కాశీనాధుని వీరేశలింగంగారిదని ఆయన్ని చూపిస్తూ ఆదినారాయణ చెప్పటం వల్ల తెలిసింది. ఎవరన్నా ఎన్ని రోజులు స్వంత ఖర్చుతో వాటిని నిర్వహించగలరు? ఇందులో ఏవిటండీ ఖర్చు అని అడుగుతున్నారు. కదూ, వినండి మరి.

మూడు రోజులపాటు వూళ్ళో వున్నవాళ్ళందరికే కాక, పొరుగూరు నుంచొచ్చిన వాళ్ళందరికి పొద్దున కాఫీ టిఫిన్లు, మధ్యాహ్నం పిండి వంటలతో సహా భోజనాలు, మళ్లీ రాత్రికి పిండి వంటలతో భోజనాలు పెట్టడమంటే మాటలా? అందుకేనండి దీనికి శివరాత్రికి విందు భోజనాలని పేరు పెట్టింది. కాలక్రమాన వీరేశలింగంగారు ఆ ప్రమాణాలతో నిర్వహించ లేకపోయారని, మరికొంత కాలానికి శవసాయుజ్యం చేశారని ఆదినారాయణ తెలిపాడు.

* * *







## రెక్క ఎంతకీ రాలేదు

పెద్దిభొట్ల ఆదినారాయణ గురించి కొంతవరకు తోట్లవల్లూరు వెళ్ళిన వుదంతంలో యింతకుముందు చూశాం. అతన్ని గురించి వివరంగా తెలుసుకునే ముందు వాళ్ళ నాన్నగారు పెద్దిభొట్ల వెంకటేశ్వర్లుగారి గురించి చెప్పుకోవాలి. వీళ్ళిద్దర్నీ మొదట కలిసింది వెమూరి శివరామకృష్ణయ్యగారి బడిలో. కొబ్బరితోటలో వాణెమ్మగారి (వూళ్ళో మొట్టమొదటి ఫ్యాన్సీ స్టోర్సు పేరు బాబా ఫ్యాన్సీ స్టోర్సు, దాన్ని వాణెమ్మగారి భర్త నడిపేవారు. తెల్లదొరల వాసనలుండేవి ఆయనకి. ఆయన అసలు పేరు ఎవరికీ తెలియదు – వాణెమ్మగారి మొగుడుగానే అందరికీ పరిచయం) మేడకి కొంచెం అవతలగా కాలవగట్టు వొద్దున శివరామకృష్ణయ్యగారి యిల్లు, ఆ యింట్లోనే బడి వుండేవి. రెల్లుగడ్డి కప్పిన రెండు నిట్టాడ్ల యిల్లు, యింటి చుట్టూ తోట, తోట మధ్యలో గిలకలేని మట్టి బావి – అదొక రమణీయ దృశ్యంలా యిప్పుడు అనిపిస్తుంది. ఉయ్యూర్లో హైస్కూలు వచ్చిందని (1951 లో) మేము శాశ్వతంగా వచ్చేశాం. అప్పటి వరకూ ఉయ్యూరు చుట్టుపక్కల వాళ్ళకి హైస్కూలు చదువు చదవాలంటే అటు పడమరగా ఆకునూరుకో లేదా తూర్పున మంటాడకో వెళ్ళాల్సి వస్తుండేది. శ్రీ కాకాని వెంకటరత్నంగా కృష్ణాజిల్లా బోర్డుకి అధ్యక్షుడిగా వున్నప్పుడు ఆయన హయములో జిల్లా మొత్తానికి 80కి పైగా కొత్త హైస్కూళ్ళు తెరిచి విద్యావాకాశాల్ని మరింత అందుబాటులోకి తెచ్చిన ఘనత పొందారాయన. అయితే కొత్తగా పెట్టిన స్కూలు కనక, అంతకుముందు దాదాపు అందరికీ వీధిబడిలాంటి చదువులే కనకా అన్ని ఫారాలకీ ప్రవేశ పరీక్ష పెట్టి తీసుకునేవాళ్ళు. దానికి ప్రిపరేషను వెంపటి శివరామకృష్ణయ్య, ఆదిరాజు పున్నయ్య లాంటివారు యిస్తుండేవారు.

పరీక్షలు దగ్గిరకొస్తుంటే ఎవరి లాంతరు వాళ్ళు తీసుకెళ్ళి రాత్రిపూట కూడా ఆయన యింట్లోనే చదువుకుని పెద్ద పిల్లలు అక్కడే పడుకుంటూ వుండేవాళ్ళు. మేస్టరుగారు అప్పుడు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ వేసిన పునాదులే భవిష్యత్తులో చాలా అక్కరకొచ్చాయి. అందరూ నిస్వార్థంగా పాఠాలు చెప్పేవాళ్ళు, వారిలో యీ మేస్టారుది అగ్రతాంబూలం. రాత్రి ఎనిమిది కొట్టగానే (అవును ఆరోజుల్లో కాలేజిలో గంటలు కొడితేనే టైము తెలుస్తుండేది అందరికీ) చేతులో లాంతరు పట్టుకుని పెద్దిభొట్ల వెంకటేశ్వర్లుగారు కొడుకు ఆదినారాయణ యోగక్షేమాల్ని కనుక్కోడానికి వస్తుండేవారు.

వచ్చి ఆయన కొడుకుని ఒకే ప్రశ్న అడిగేవారు – 'ఏరా ప్యాసు పోసుకున్నావా'? అని. నమ్మకం కుదరకపోతే పక్కనున్న పిల్లాణ్ణి, 'ఏరా మావాడు ప్యాసు పోసుకున్నాడా' అని అడిగి రూఢిగా తెలుసుకునేవారు. లేకపోతే పక్కలో పోస్తాడని భయం ఆయనకి. అంతకుముందు ఆయన్ని ఎలిమెంటరీ స్కూల్లో చదువుకున్న కొద్దిపాటి చదువప్పుడు చూశాం. చాలా మంచి మనిషి, అయితే తెల్లటి కళ్లతో యింతలావు పొట్టతో చేతులో బెత్తం పట్టుకుని వూపుతూ 'ఏరా?' అంటూ అరిస్తే పిల్లలందరూ భయపడేవాళ్ళు.

ఎలిమెంటరీ స్కూల్లో జరిగిన ఒక చ్చి ముచ్చట. ఆ స్కూలు కోటకి యివతల వుండేది. మాయింటికి దాదాపు పక్కనే. ఒకప్పుడు అది రాజావారి గొడ్లసావిడి, వెంట్రప్రగడ వెంకటరత్నం గారు దాన్ని కొనుక్కున్నారని చెప్పుకున్నాం. ఓ సారి మా అన్నయ్య దుర్గప్రసాదు క్లాసులో ఏదో అల్లరి చేసినట్టున్నాడో లేక వాళ్ల అబ్బాయిని ఏదో అన్నట్టున్నాడో గుర్తులేదు కాని, నిమిషంలో మావాడు పారిపోటం మాత్రం గుర్తుంది – ఆ రోజుల్లో అందరూ కాలకృత్యాల్ని చేమల్లోనే తీర్చుకునేవారు. మొగా ఆడా భేదం లేకుండా. రెండు నిమిషాలకల్లా వెంకటేశ్వర్లుగారు బెత్తం వూపుకుంటూ, 'ఏడిరా మీ అన్నయ్య?' అంటూ వచ్చేశారు. మాకు విషయం తెలియక చేమల వైపు చూపించాం. ఇంకేముంది దొడ్లోకి పరిగెత్తి మావాడికి కొంచెం దూరంగా నుంచుని, 'ఏరా అయిపోయిందా?' అని అడిగితే, ' ఇంకా అవలేదు మాస్టారూ' అంటూ ఈతచెట్టు చాటునించి సమాధానం వచ్చింది కాసేపాగి మళ్లీ, 'ఏరా యింకా అవలేదా?'అని ఆయన అడగటం, యీసారి మావాడు గట్టిగా ముక్కుతూ, ' ఇంకా అవలేదు మాస్టారూ' అనడం ఐదు పది నిమిషాలపాటు సాగింది. ఆయనకి ఓపిక నశించో, క్లాసు వదిలిపెట్టి వచ్చినందుకో వెళ్లిపోయారు. ఆయనలా వెళ్ళగానే చెంబులో వున్న నీళ్ళు పారబోసి మావాడు విజయగర్వంతో నవ్వుకుంటూ లోపలికొచ్చాడు.

వెంకటేశ్వర్లుగారిలో విశేషమైన స్వభావం హ్యూమిలిటీ. ఒక ఎలిమెంటరీ స్కూలు టీచరుగా వుండటమే కాకా స్వంత యిల్లు కాని, సెంటు పొలం కాని లేకుండా వూళ్లో అందరికన్నా కొన్ని మెట్లు దిగువ స్థాయిలో వున్నందుకనేమో ఎవరితోనూ ఎక్కువగా కలిసేవారు కాదు. పక్కవూరికి బదిలీ అయినప్పుడు కుటుంబాన్ని ఉయ్యూర్లోనే వుంచి సైకిలు మీద వెళ్ళి వస్తుండేవారు. సైకిలు మీద అంటే – సైకిల్ని వూరి పొలిమేర దాకా నడిపించుకుంటూ అని. తిరిగొచ్చేటప్పుడు కూడా మళ్ళీ పొలిమేర దగ్గర దిగి





నడిపించుకుంటూ వచ్చేవారు. తనకన్నా పెద్దవాళ్ళందరూ వాళ్ళో నడుచుకుంటూ పోతుంటే వాళ్ళ ముందు తను సైకిలెక్కి వెళ్ళటం అగౌరవపరిచినట్టుగా అనిపించేది ఆయనకి. సత్తెకాలం కాదూ మరీ!

అలా హైస్కూలుచదువులు మొదలవటంతో సూరి నరసింహం, ఆదినారాయణలు ఎప్పుడూ మా యింట్లోనే వుంటుండేవారు. ఆదినారాయణ అయితే పడక కూడా ఇక్కడే. ఇంట్లో అందర్నీ అక్కయ్యగారు, అన్నయ్యగారు అని పిలుస్తూ ఎంతో కలివిడిగా కలిసిపోయాడు. చదువులో చాలా వెనక కాబట్టి మా నాన్నగారు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని నేర్పుతుండేవారు. మచ్చుకి ఒక ఉదాహరణ : భారత రాష్ట్రపతి – డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్; ప్రధాన మంత్రి – జవమర్‌లాల్ నెహ్రూ; ఆంధ్ర రాష్ట్రానికి గవర్నరు – సి.యమ్. త్రివేది; ముఖ్యమంత్రి – టంగుటూరు ప్రకాశం పంతులు. ఇలా ఆయన పది పదిహేను సార్లు రోజూ అతన్తో చెప్పించేవారు. అది అయినాక ఎంతవరకు నేర్చుకున్నాడో ఏమాత్రం గుర్తుంచుకున్నాడోనని, ' యిప్పుడు నేనడుగుతాను, కళ్లు మూసుకుని చెప్పు ఆదినారాయణా' అంటూ అడిగితే అతని జవాబులు యిలా వుండేవి: రాష్ట్రపతి–జవహర్‌లాల్ నెహ్రూ; ముఖ్యమంత్రి – సి.యమ్. త్రివేది; ప్రధాన మంత్రి – టంగుటూరు ప్రకాశం పంతులు యిలా రోజులకొద్ది సాగుతుండేది వాళ్ళిద్దరి మధ్యా.

ఆరోజుల్లో రెండు మూడు సార్లు ఎలెక్షన్లు జరిగాయి. ఎలెక్షన్లొస్తే ఆదినారాయణకి పండగ. కాంగ్రెసు పార్టీ అభ్యర్థి కాకాని వెంకటరత్నంగారు. ఆ పార్టీకి అప్పటి ఎన్నికల గుర్తు కాడితో వున్న జోడెద్దులు. కార్యకర్తలతో పాటు ఆదినారాయణ కూడా కేన్వాసింగ్‌కి వెడుతుండేవాడు. భలో (బోలో) స్వతంత్ర భారత్ కీ జై, వూర (వీర) కాకానీ జిందాబద్ అంటూ వూళ్ళనీ కేన్వాస్ చేసి తిరిగొచ్చినందకు కాఫీ, ఉప్మాలు పెట్టారయ్యా అని చెబుతుండేవాడు.

ఆదినారాయణకి సంగీతమంటే మంచి అభిరుచి. దాంతో ఎక్కడ పాట కచ్చేరీ వున్నా, హరికథలు, పౌరాణికి నాటకాలు జరుగుతున్నా వెంటనే హాజరయి, వాళ్ళకి ఏకలవ్య శిష్యుడిగా తనూ కొంత నేర్చుకునేవాడు. ముఖ్యంగా కంసాలి బజార్లో కంసాలి హరిదాసుగారినించి శ్రుతి, తాళం, రాగం వగైరాలు కొద్దిపాటిగా నేర్చుకుని మాకు వివరిస్తుండేవాడు. శ్రీ కృష్ణరాయబారం పద్యాలు, హరిశ్చంద్రలో కాటిసీను విశిష్టత, వేమూరి గగ్గయ్య, పీసపాటి, అబ్బూరి, కె. రఘురామయ్య, పసపాటి, షణ్ముఖి

ఆంజనేయశర్మ లాంటివారి గురించి మేము తెలుసుకోటం కేవలం ఆదినారాయణ చలవేనని చెప్పక తప్పదు. తాళ బద్ధంగా భజనలు చేయటం అతనికి బాగా తెలుసు. ఓసారి ఎక్కడ్నించో పట్టు ధోవతి, వుత్తరీయం తెచ్చుకుని నుదుటన చెమ్కీతో మెరుస్తున్న ఎర్రటి బొట్టు నిలువుగా పెట్టుకుని మాయింట్లో హరికథ చెప్పాడు కాసేపు. అది విన్న మా నాన్నగారు – 'ఈరోజునించి, నీపేరు పెద్దిభొట్ల ఆదినారాయణ కాదురా, ఆదిభొట్ల పెద్దినారాయణదాసురా!' అని చమత్కరించారు ( హరికథా పితామహుడు ఆదిభొట్ల నారాయణదాసుగారి పేరునీ, పెద్దిభొట్ల ఆదినారాయణ హరిదాసునీ కలిపిన పేరది).

అలా ఆడుతూ పాడుతూ మొత్తానికి అందరూ ఫిఫ్త్ ఫారం, అంటే పదవ తరగతి వరకూ చేరారు. పదకొండవ తరగతి స్కూల్ ఫైనలుగా వుండేదప్పుడు. పదో తరగతి పాసవటం ఒక హర్డిల్ కొంతమందికి. మార్కులు తక్కువొస్తే పాసు చేసేవాళ్ళు కాదు. పదో తరగతి వరకూ మూడు సెక్షన్లుంటే ఎస్సెల్సెల్సీలో రెండే వుండేవి. అందులో ఒకటి – ఆల్జిబ్రా ఎక్కువున్న కాంపోజిట్ మాథమెటిక్స్, రెండోది జనరల్ మేథమెటిక్స్. కనీసం సగం సెక్షనుకి పైగా పదవ తరగతితో ఆగిపోతుండేది. మళ్లీ పదవ తరగతి చదవాలి, పాసవ్వాలి. ఒకవేళ మూడుసార్లు కనక వరసగా తప్పితే దయ చూపించి స్కూల్ ఫైనలుకి పంపించేవాళ్ళు. ఆ బాటలో మొత్తానికి స్కూల్ ఫైనలుకి చేరుకున్నాడు ఆదినారాయణ. మేమంతా కాలేజి చదువులు ముగించే లోపల అతను స్కూల్ ఫైనలుకొచ్చాడు. ఈ వ్యవధిలో తన ప్రవృత్తిని మాత్రం పదిల పరుచుకుని మరింత మెరుగుపరుచుకున్నాడు. అయితే అవి వుద్యోగాలిస్తాయా, కడుపు నింపుతాయా. అయినా వున్న క్వాలిఫికేషన్తో ఖాదీ గ్రామోద్యోగ్ కమిషన్లో కాకినాడలో చిన్న వద్యోగం సంపాదిస్తే యిన్నాళ్లకి దేవుడు ఆ కుటుంబానికి మేలు చేశాడని తృప్తి పడ్డాం.

పెళ్ళవటం, పిల్లలు పుట్టడం వరసగా జరిగాయి. ఖాదీ అమ్మకాలు సరిగా లేనందుకో ఏమో తరవాత తెలిసింది ఆదినారాయణ ఖాళీగా వున్నాడనీ, సంపాదన లేదననీ, ఒకసారి కనిపించి రైల్వేలో వుద్యోగం వచ్చిందనీ, అందూలోనూ బెజవాడలోనేననీ, ఖాజీపేటనించి విజయవాడ దాకా తనదేనన్నట్టు చెప్పాడు. సంబరపడ్డాం, అతిశయోక్తికి ఎప్పట్లా నవ్వుకున్నాం. కొద్దిరోజుల తరువాత బెజవాడ స్టేషన్లో కలిసి మమ్మల్ని రెఐలెక్కించి అక్కడ అన్నీ తన యాజమాన్యంలోనే వున్న ధీమా చూపిస్తుంటే ముచ్చటేసింది. 'ఇంతకీ నువ్వు చేసే వుద్యోగం ఏమిటయ్యా?'





అని అడిగితే ఒకవేళ అదేదో చిన్నపాటి వుద్యోగమైతే చిన్నబుచ్చుకుంటాడేమోనని ఎప్పుడూ అడగలేదు. ఉద్యోగం నించి అతన్ని తీసేశారని మరికొద్ది కాలానికి తెలిసింది. పై అధికార్లకి తనంటే ద్వేషం అనీ, బ్రాహ్మలంటే యింకా మరీ ద్వేషమనీ, వాళ్లని కోర్టుకీడ్చి మళ్లీ వుద్యోగం సంపాదిస్తానని కనబడినప్పుడల్లా చెబుతుండేవాడు. జరిపిన కరెస్పాండెన్స్ కాపీలు చూపిస్తుండేవాడు. ఇలా చాలా ఏళ్ళు గడిచాయి. ఎప్పుడో వంగల సుబ్బయ్యగారి దగ్గర నేర్చుకున్న కాసిన్ని మంత్రాలు, పూజా విధానాలు యిప్పుడు అతనికి కొంత అక్కరకొచ్చి దాంతో కుటుంబాన్ని పోషించుకుంటూండేవాడు.

తను ఇంకా రైల్వే వుద్యోగినేనన్న ధీమా కూడా వుండేదతనికి. అందువల్ల ఎవరన్నా న్యాయం చేస్తారేమోనని ఎన్నో చోట్లకి తిరిగొస్తుండేవాడు. ఓసారి ఢిల్లీ వెళ్ళి సుప్రీం కోర్టు జడ్జిగార్ని కలిశొచ్చాననీ, తెలుగువాడేననీ, ఆందులోనూ బ్రాహ్మణ్యం అంటే ఆయన పడిచస్తాడనీ, నెలరోజులుపాటు వాళ్ళింట్లోనే వుండొచ్చాననీ చెప్పాడు. 'అంతవరకూ బానే వుందయ్యా' మరి ఢిల్లీ వెళ్లటానికి టిక్కెట్టూ, ప్రయాణం ఖర్చులూ ఎలా మేనేజ్ చేశావయ్యా?' అని అడిగితే, ' మన్నెవరడుగుతారయ్యా టిక్కెట్టు? స్టాపు కదా' అంటూ ధీమగా చెప్పేవా. ఇలా ఏళ్ళూ పూళ్ళూ గడిచాయి. హైదరాబాదులో వుండి పౌరోహిత్యం చేసుకుంటూ రైల్వే హెడ్ క్వార్టర్సుకి దగ్గరగా వుంటే మంచిదని తనొక్కడు అక్కడికి చేరాడు. జడ్జిమెంటు తన పరంగానే వచ్చిందనీ, యింక ఆర్డర్సు యింప్లిమెంటు కావడమేననీ యింకోసారి చెప్పాడు, కాగితాలేవో చూపించాడు. అప్పటికే వయసు దాటింది, అతని తోటి వాళ్ళు సర్వీసు నుంచి రిటైరవుతున్నారు. తనని రైల్వే వాళ్ళు ఏవిధంగానైనా రీ-యిన్‌స్టేట్ చేస్తారు, అరియర్సుతో సహా డబ్బు యిస్తారు ('ఎవరికోసం యిస్తారయ్యా, చచ్చినట్టిస్తారు. కక్కిస్తాను వాళ్ళతో') అని చెబుతుండేవాడు. ఇదంతా నిజమా లేక బతకటానికి అతను కల్పించకున్న వూహా చిత్రమా అనేది అతనికే తెలియాలి.

అతను చెయ్యని వుద్యోగం మళ్ళీ అతని చేతికి రాలేదు. రెక్క పడకపోవటంతో ఎదురు చూసిన రైలు అతని జీవితకాలంలో రాలేదు. సంచినిండా పేపర్లు మాత్రం నింపి పెట్టుకున్న ఆ ఆశాజీవి అభాగ్యజీవిగా కన్నుమూశాడు.

* * *

### జై ఆంధ్ర... జై ఆంధ్ర... జైజై ఆంధ్ర...

1953 అక్టోబరు 1వ తేదీ న ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు ఉయ్యూరు పాలిటెక్నిక్ కాలేజీలో స్టూడెంట్సు, లెక్చరర్సు కలిసి మళ్ళీ స్వతంత్రం వచ్చినంత సంబరం చేసుకున్నారు. కాలేజీ ముందు రంగు కాగితాలు తోరణాలు, లైట్లు, లోపల సభలు, రాత్రికి కాలేజీ ముందు బిల్డింగు పైభాగాన మూడు రంగుల్లో జై ఆంధ్ర  అని మూడు అక్షరాలు రాశుండి లోపల లైటు వెలుగుతూ తెల్లవార్లు బొంగరంలా తిరుగుతుండే డ్రమ్ము. ఎటు చూసినా హడావిడీను. సినీనటి భానుమతి– 'స్వరాంబెత్తి పాడరా సోదరా ఆంధ్రోదయ వేళా...' అంటూ ఆకాశవాణిలో గొంతెత్తి ఆలపించి స్వాగతం పలికారు.

మద్రాసు రాష్ట్రం నించి, ముఖ్యంగా నక్కజిత్తులమారి అని పెద్దవాళ్ళందరూ అంటుండే రాజగోపాలచారి నించి విడిపోతున్నందుకు తెలిసీ తెలియని మయసులో మాకూ ముచ్చటేసింది. మనం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వున్నప్పుడు మంత్రివర్గం ఏర్పాటు సమయంలో టంగుటూరి ప్రకాశం పంతులుగారికే మేజారిటీ వుందట. అయితే అప్పటికే స్వతంత్ర భారత దేశానికి మొట్టమొదటి గవర్నరు జనరలుగా (అది యిప్పటి రాష్ట్రపతి పదవితో సమానం) పనిచేసిన శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రాజగోపాలాచారి ముఖ్యమంత్రి పదవికోసం ఎగబడ్డాడు. నెహ్రూగారికి అది యిష్టం లేదని తెలిసి కూడా, పైగా తను కూడా తెలుగువాడినేని, 'తమిళులకి యింటిపేరు వుండదు కదా, మరి  చూడండ నాయింటి పేరు చక్రవర్తుల కదా'  అని మభ్యపెట్టి కుర్చీలో కూచున్నాడట. సగం పైగా తెలుగు జనాభా వున్న మద్రాసు పట్టణం రాష్ట్ర విభజనలో మనకు దక్కలేదు. దత్తుగారు అంటుండేవారు – ' ఒక్క ప్రకాశం పంతులుగారు మాత్రం పదిమంది అనుచరులతో మద్రాసు పట్టణం మనదే, అది ఆంధ్రరాష్ట్రంలో కలవాలి' అని రోడ్డుమీద కేకలేసుకుంటూ తిరగటం తప్ప వేరే ఏ రాజకీయ నాయకుడూ పట్టించుకోలేదట. అలా జరిగిన విభజనలో మనకి జరిగిన లాభం మాత్రం తిరుపతి పట్టణం ఒక్కటే. ఎక్కువమంది తెలుగువాళ్ళున్న బళ్ళారి జిల్లా, తిరుత్తణి, కోలారు, బరంపురం లాంటివెన్నో మనకు దక్కలేదు.ః

స్వంత రాష్ట్రం వచ్చిందే గొప్ప, మరింక మనమంతా మంత్రులూ, ముఖ్యమంత్రులూ కావొచ్చు కదా అని మన నాయకులు – ప్రకాశంగారు మనహా – తృప్తి పడ్డారట. రాష్ట్రం వచ్చింది, సమస్య తెచ్చిపెట్టింది. రాజధాని ఎక్కడ పెట్టాలి?





దాంతో మరింత ప్రాంతీయ తత్వం పెరిగింది. రాయలసీమలో కాలని కొందరు, సర్కారులోనే వుండాని మరికొందరు. మరి సర్కారులో అయితే విజయవాడా లేకా విశాఖపట్నమా? చివరికి కాంప్రొమైజ్ ఫార్ములాలో రాజధాని అయితే రాయలసీమకి చెందిన కర్నూలులోనూ, హైకోర్టు మాత్రం సర్కారుకి చెందిన గుంటూరులోనూ అని రాజీకొచ్చారు మన నాయకులు. నిస్వార్ధ సేవకుడైన టంగుటూరి ప్రకాశం పంతులుగారు మొదటి ముఖ్యమంత్రి అయ్యారు. ఆ సంబరం ఎంతకాలమో నిలవనియ్యలేదు స్వార్ధపూరిత నాయకులు మన మొదటి జై ఆంధ్ర స్లోగను అలా ముగిసి, తరువాత విశాలాంధ్రకు దారితీసింది.

ఇది జరిగిన మూడేళ్ళకి పొట్టి శ్రీరాములుగారి ఆమరణ నిరాహార దీక్షత భాషాప్రయుక్త రాష్ట్రాలుగా దేశ విభజన జరిగినప్పుడు 1956 నవంబరు1న పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారి చేతుల మీదుగా ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగింది. అప్పటి వరకూ ఆంధ్ర ప్రాంతంలో నివసించే వాళ్ళకి హైదరాబాదు గురించి తెలిసింది చాలా తక్కువ. బెజవాడలో నైజాం బండ్లుగా వ్యవహరించబడే రైళ్ళు ఎక్కడానికి జంకుగా వుండేది. కోర్టులకి కానీ, సినిమాలకి కానీ, సాంస్కృతికంగా కానీ, తెలుగు వార్తా పత్రికలకికానీ మద్రాసు పట్టణమే అందరికీ సుపరిచితం. 'ఏమగీ యీ మధ్య కనిపించడం లేదు, వూళ్ళో లేరా? అని అడిగితే, 'మరేనండి, చెన్నపట్నం వెళ్ళొచ్చానండి' అని అదేదో ఏలూరుకొ, రాజమండ్రికో వెళ్ళొచ్చినంత తేలిగ్గా చెప్పుకుంటుండే వాళ్ళు. సర్కారు జిల్లాలనించి ప్రజలు క్రమంగా హైదరాబాదుకొచ్చి స్థిరపడి దాని అభివృద్ధికి దోహదం చేశారు. సరిగ్గా యిది పదమూడు సంవత్సరాలు మాత్రం నిలిచింది. 1969లో మొదలైన జై తెలంగాణా వుద్యమంలో ఆంధ్రావారిని వెళ్ళిపొమ్మన్న స్లోగన్‌ని ఎదుర్కొనేందుకు మళ్లీ జై ఆంధ్రా స్లోగను బయటికొచ్చింది. దాంతో జై తెలంగాణా వుద్యమం తగ్గింది, లోపల్లోపల రాజుకుంటూనే వుంది.

ఇప్పుడు మళ్లీ ప్రత్యేక తెలంగాణా కావాలన్న నినాదంతో ఒక్కటి కాదు రెండు కాదు – జై ఆంధ్ర, జై రాయలసీమ, జై ఉత్తరాంధ్ర... యివన్నీ యిచ్చిన తరువాత జై కృష్ణాజిల్లా... వగైరాలు రావటానికి ఎంతోకాలం పట్టదు. ఎన్ని వచ్చినా మా ఉయ్యూరు పాలిటెక్నిక్ కాలేజిలో నాలుగు సంవత్సరాలపాటు ప్రతి అక్టోబరు 1వ తేదిన రాత్రిపూట లైట్లతో తిరిగిన జై ఆంధ్ర డ్రమ్ము ముందు తీసికట్టు.

# నరసింహ శాస్త్రుల్లు గారింట్లో నృసింహ జయంతి

శివాలయం వీధి చివరలో కాలవొడ్డున ఎడమవైపునున్న డాబా యిల్లు సీతారావమ్మగారిది. స్నానాల రేవుకి యివతలగా వుంటుంది. ఆ యింటికి పక్కనుండే యిల్లు చెరుకుపల్లి నృసింహశాస్త్రుల్లు గారిది(అర్ధ శతాబ్దం పైగా వారిల్లు అదే ప్రహరీ గోడతో, అవే విధి తలుపుతో మార్పులు లేకుండా యింకా అలానే వుండటం విశేషం).

పచ్చటి వొంటి మీద నీరుకావి రంగు అంచున్న పలచటి తెల్ల పంచె కట్టుచుని మెడలో రుద్రాక్షమాలలు, చెవులకి లావుపాటి బంగారు కుండలాలు వేళ్ళాడుతూ నిఠారుగా నుంచుని నడిచేవారాయన, ఆయన భార్య అన్నపూర్ణమ్మగారు – పేరుకే కాదు, రూపుకీ తీరుకీ ఆవిడ అన్నపూర్ణలాగానే వుండేవారు. తెలతెలవారుతుండగానే రోజూ యిద్దరూ రేవులో స్నానం ముగించుకుని తడి బట్టలతో బయటికొస్తుంటే అప్పుడప్పుడే యాగదీఓ ముగించుకుని అవభృతస్నానం చేశొస్తున్న సొమయాజులూ, సోమిదేవమ్మగార్లలా వుండేదా జంట. వేరే ఎంతోమంది శాస్త్రుల్లుగార్లున్నా ఆయన్ని మాత్రం అందరూ శాస్త్రుల్లుగారు అనే వ్వవరించేవాళ్ళు. మంచి పెంకుటిల్లు, మాగాణిపొలం. ఒక్కడే కొడుకు.

వీధిలో వున్న బ్రాహ్మణ్యమంతా ఏ శుభకార్యం వచ్చినా యీ జంటని తప్పకుండా భోజనానికి పిలిచేవాళ్ళు, వాళ్ళు కూడా తప్పకుండా వచ్చేవాళ్ళు. ఇక్కడొక చిన్న లాంఛనం మాతర్ం ఉండేది. శాస్త్రుల్లగారికి దేవతార్చన పెట్టె వుండేది. అందులో – యిత్తడితో పోతపోసిన దేవతల, దేవుళ్ల విగ్రహాలు, రంగు రంగుల సాలగ్రామాలు – విష్ణుమూర్తి చిహ్నాలైన గుండ్రటి శిలలు–వుండేవి. వాటికి రోజూ విధిగా అర్చన చేయాలి, ఆవు పాలతో అభిషేకించాలి. పొద్దునపూట అరటిపండో, మామిడిపండో– రుతువుల్ని బట్టి దొరికే పండ్లు నైవేధ్యం పెట్టాలి. వంటైన తరువాత భోజనానికి ముందు మళ్లీ అర్చన చేసి మహా నైవేద్యం చెయ్యాలి. ఇంట్లో ఏదన్నా పురుడు, మైల లాంటి అవాంతరాలు కనక సంభవిస్తేనో, వూరు వెళ్లవలసి వస్తేనో దేవతార్చన పెట్టెని నిత్యం దేవతార్చన చేసే యింటికి తరలించాలి కానీ, అర్చన ఆగిపోకూడదు, దేవుళ్లని వుపోషం వుంచకూడదు. అదొక నియమం. అలాంటి యిళ్లు కేవలం రెండు మూడే వుండేవి. మరి వూళ్ళో వాళ్ళు భోజనానికి పిలిస్తే ఎలా? అందుకే ఆయన్ని భోజనానికి పిలిచేవాళ్లు కాదు. 'శాస్త్రుల్లుగారూ, రేవూ ఎల్లుండీ తమరి దేవతార్చన మా యింట్లోనే నండీ' అంటూ చెప్పేవారు.





అది వినంగానే పక్కనున్న నాలాంటి చిన్నపిల్లవాడిని వుద్దేశిస్తూ ఆయన, 'వొరేయ్, అయితే పొద్దున తొమ్మిదీ తొమ్మిదిన్నరకల్లా వొచ్చి దేవతార్చన పెట్టెని మీ యింటికి పట్టుకెళ్ళరా' అనేవారు. అంటే ఆవేళ్లికి పొద్దుటి పూజ ముగించేసి రెడీగా పెట్టుండేవారాయన. అది మోసుకెళ్లి – నిజంగానే మొయ్యాల్సి వచ్చేది, పెట్టే చిన్నదే అయినా మందంగా వుండే గట్టి ఇత్తడి పెట్టె, దానికో మూత, కొండెం, పైగా విగ్రహాలు ఇత్తడివి, సాలగ్రామాలు (ఉత్తరభారతదేశంలో నదుల్లో దొరికే గుండ్రటి తెలుపు, నలుపు, చందనం రంగుల్లో మిలమిలలాడే రాళ్ళు) – దాని యింట్లో పూజగదిలో దేవుడి దగ్గిర వుండాలి. మధ్యాహ్నం భోజనానికి గంట ముందు శాస్త్రుఉల్లు గారొచ్చి దేవతార్చన చేసేందుకు సిద్ధంగా ఆవుపాలు పక్కనుంచాలి, గంధాక్షితలు నూరి వుంచాలి. గంధం చెక్కని సానమీద నీళ్లుపోస్తూ అరగదీస్తే గంధం, నల్లటి చెక్కని అరగదీస్తే అక్షతలు వస్తాయి – అదొక పెద్ద కార్యక్రమం. ముఖానికి అడ్డంగా గంధం రాసుకుని దానిమీద యీ నల్లని బొట్టుతో కనిపించిన బ్రాహ్మడు భోజనం ముగించాడని లెక్క. అక్షతల చెక్క లేనివారింట్లో కుంకుమతో సరిపుచ్చుకునేవారు. వంట అవడానికి ఒక గంట ముందుగానే, 'వంటయింది, మీరు దేవతార్చనకి రావచ్చు' అన్న అబద్ధం చెప్పేది శాస్త్రుల్లవారికే. అప్పుడాయన మళ్ళీ స్నానాదికాలు ముగించుకుని, మడిబట్ట కట్టుకునొచ్చి దేవతార్చనకి కూచుంటే పూజ సరిగ్గా గంటసేపు పట్టేది. అందుకనే ముందు ఆయనకి పిలుపు వెడుతుండేది. ఇక్కడ యింకో విశేషం ఏవిటంటే – శాస్త్రుల్లుగారు, మా తాతయ్య గుండు లక్ష్మీనరసింహశాస్త్రిగారు వంట బ్రాహ్మలు వండిన వంటలు తినేవారు కాదు. బంగాళా దుంపలు, టమోటాలు లాంటివి నిషిద్ధం. అందుచేత వీళ్ళిద్దరికీ మరికొంతమందికీ యింటి ఆడవాళ్లు ప్రత్యేకంగా వంట వండేవారు. దాన్ని – స్వహస్తం అనేవారు. మా మావయ్య తమాషాకి 'ఏవయ్యా మీది స్వహస్తమా, పరహస్తమా?' అని అడుగుతుండేవారు. శాస్త్రుల్లుగారిని భోజనానికి పిలవాలంటే యింత తతంగం వుంటుండేది. మరి ఆయన యింట్లో ఎలా ఉండేది అన్న వుత్సుకత కలుగుతుంది యిది చదివేవాళ్ళకి.

వైశాఖ శుద్ధ చతుర్ధశి నృసింహ జయంతిగా ప్రసిద్ధి. ప్రతి సంవత్సరం చెరుకుపల్లి నృసింహశాస్త్రుల జంట నృసింహ జయంతిని వాళ్లింట్లో ఘనంగా జరిపేవారు. మండు వేసవిలో వచ్చే నృసింహ జయంతి కోసం అందరూ ఎదురుచూస్తుండే వాళు.

ఆ రోజున ఆ దంపతులిద్దరూ వుపవాసం వుండి, వూళోల వాళ్ళందర్నీ భోజనానికి పిలిచేవాళ్ళు. పూజ ముగించి ప్రసాదంగా పానకం, వడపప్పు యిచ్చి, భోజనంలో మామిడిపళ్లు వడ్డించి, కొత్త తాటాకు విసనకర్రలతో ఒక్కొక్కరికీ విసురుతూ ఆ విసనకర్రని వాళ్లకి దానంలా యిచ్చి సత్కరిస్తుండేవాళ్లు. అందుకే కొంత మంది యిళ్ళల్లో, 'అబ్బ, వేసవికాలం వొచ్చేసింది, మహా వుక్కపోతగా వుంది' అనంటే, 'నాల్రోజులు ఆగండ్రా, నృసింహ జయంతికి శాస్త్రుల్లగారు తాటాకు విసనకర్రలు ఎలాగూ యిస్తారుగా' అన్న సంభాషణ వినిపిస్తుండేది.

మండు వేసవిలో పానకం, తాటాకు విసనకర్రలు చక్కటి వుపశాంతి కదా!

ఇంకో విశేషం ఏవిటంటే, యిది రాసిన రోజు సర్వధారి సంవత్సర వైశాఖ శుద్ధ చతుర్దశి. అంటే నృసింహ జయంతినాడు అవటం కాకతాళీయం. చెరుకుపల్లి నృసింహశాస్త్రులుగారి జీవిత సేవలకి ఆనందించిన నృసింహుడు నాచేత యిది రాయించాడేమో తెలీదండి!







## ఊరికి ఉపకారి

స్వాతంత్ర్యం వచ్చిన కొత్త రోజులవి, చదువులకీ, వుద్యోగాలకీ అవకాశాలు ఎక్కువవుతున్న రోజులు. ఉయ్యూరులోనూ, చుట్టపక్కలా గ్రామల్లోనూ వున్న రైతులు చాలా మటుకు మధ్య తరగతి వాళ్ళే. స్కూల్ ఫైనల్ దాకా ఎలాగోలాగు చదివించిన తరువాత కాలేజి చదువులకి బెడవాడకో, బందరుకో పంపించి చదివించగల స్తోమత చాలా తక్కువ మందికి వుండేది. కారణం కేవలం వ్యవసాయం మీద ఆధారపడటం వల్లనే కాక ఉమ్మడి కుటుంబ వ్యవస్థ మూలంగా పెద్దవిగా వుండేవి.

ఆ సమయంలోనే సీతంరాజు లక్ష్మీనారాయణ గారి కుమారుడు సీతంరాజు సత్యనారాయణ గారు వూరికి మహోపకారం చేశారు. శివాలయం దాటి కొంచెం ముందుకొస్తే కుడివైపున చిన్న సందులో వడ్డే శోభనాద్రీశ్వరరావు (తెలుగుదేశం పార్టీ ప్రభుత్వంలో ఒకప్పుడు వ్యవసాయ మంత్రిగా వున్న వడ్డే శోభనాదీశ్వరరావు గారి తాతగారు) గారింటికి వెళ్ళే దారిలో ఎడంపక్కగా సత్యనారాయణ గారు స్వంత యింటి లోగిలిలో ఆంధ్రా టైప్ ఇనిస్టిట్యూట్ పెట్టారు. పై చదువులకి అవకాశం లేనివారికి ఎడారిలో ఒయాసిస్సులా యేళ్ళ తరబడి టైపు, షార్టు హ్యాండు నేర్పుతుండేవారాయన.

ఆరోజుల్లో టైపు నేర్చుకుంటే నెలకి నాలుగు రూపాయలు ఫీజు, షార్టుహ్యాండ్ నేర్చుకుంటే ఐదు రూపాయలు ఫీజు; రెండూ నేర్చుకుంటే ఎనిమిది రూపాయలు ఫీజు – అంటే, రెండూ నేర్చుకుంటున్నందుకు రూపాయి రాయితీ అన్నమాట. రోజు గంట ప్రాక్టీసు. ఆదివారం సెలవు. పొద్దున ఏడు గంటలకల్లా మొదలైనది సాయంత్రం కరెంటు లేని రోజుల్లో చీకటి పడేందవరకూ, కరెంటు వచ్చిన తరువాత రాత్రి ఏడు, ఎనిమిది గంటల వరకూ సాగుతుండేవి బ్యాచులు. వేసవి సెలవల్లో ఎంతోమంది విద్యార్థులుండేవారు.

పొద్దున ఎనిమిది గంటలకల్లా సీతంరాజు సత్యనారాయణగారు తెల్లటి ముతక ఖద్దరు పంచె మీద తెల్లటి సగం చేతుల పొట్టి లాల్చీ వేసుకుని లోపలినించి వచ్చేవారు. మనిషి మంచి పసిమిరంగులో వుండేవారు. **asdfg ;lkjh** అని అనిపిస్తూ ప్రాక్టిస్ చేయిస్తుండేవారు. 'చూడు బాబూ నువ్వు కీ బోర్డుని చూస్తూ టైపు కొట్టి ఎప్పటికీ నేర్చుకోలేవు, మేటరు మాత్రమే చూడాలి, నీ మునివేళ్లు మాత్రమే కీస్‌ని చూడగలగాలి' అంటూ ఒక విడత అందర్నీ పలకరించి వున్న ఒక్క కుర్చీలో బల్లముందు కూచునేవారు.

మునివేళ్ళకి కళ్ళుంటాయా చూడ్డానికి అని మాలాంటి వాళ్ళు అప్పట్లో అనుకున్నా నెల రెండు నెలల ప్రాక్టిస్ చేసేసరికి సత్యనారాయణగారు ఎంత గొప్పగా చెప్పారు. అనిపించేది. ఆ లోపల షార్టుహ్యాండ్ విద్యార్థులు ఆయన కోసం కాచుకునుండేవారు. కొత్తగా నేర్చుకునే వాళ్ళకి పిట్‌మన్స్ షార్టుహ్యాండ్ బుక్‌లోంచి డిఫ్తాంగ్ లంటూ ఎదో కొత్తభాషలో మాట్లాడుతున్నట్టు నేర్పేవారు. మరికాసేపటికి అప్పుడే వచ్చిన హిందూ పేపరు తీసుకుని దాంట్లోంచి సీనియర్లకి ఒకే తరహా మాడ్యులేషన్‌తోనూ, సరైన స్పీడుతోనూ డిక్టేషన్ యిస్తుండేవారు. కాసేపయిన తరువాత వాళ్లు షార్టుహ్యాండ్‌లో రాసుకున్నది పైకి చదివించి తప్పులు దిద్దేవారు.

ఈ లోపల జాబ్‌వర్క్ కోసం ఎవరో వచ్చేవారు. చిన్న చిన్నవి అయితే టైపు లోయర్ పరీక్ష పాసయి, హైయర్ కోసం ప్రాక్టిసు చేసుకుంటున్న విద్యార్థుల చేత చేయించేవారు. పెద్ద పెద్ద అర్జీలులాంటివి ఆయన స్వయంగా చేసిచ్చేవారు. వాటి కోసం ప్రత్యేకంగా ఒక టైప్‌మిషన్ కేటాయించేవారు. సీతంరాజు సత్యనారాయణగారు టైపుమిషను ముందుకూచుని మంచి స్పీడులో టైపు చేస్తుంటే కన్నులకే కాదు వీనులకి కూడా విందు వుండేది. కీ బోర్డు మీద వేళ్లు ఎగురుకుంటూ నాట్యం చేస్తున్నట్టుగా కదిలేవి. లయ బద్ధంగా మిషన్‌చేసే చప్పుడు ఆ నాట్యానికి పక్కవాయిద్యంగా పలుకుతుండేది.

ఆయన దగ్గర టైపు, షార్టుహ్యాండు నేర్చుకునేవాళ్లు లోయర్, హయ్యర్ పరీక్షలకి హాజరవుతుండేవారు. పరీక్షల టైములో సత్యనారాయణ గారు చాలా హడావుడి చూపించేవారు. పరీక్షలు బెజవాడలోనూ, బందరులోనూ జరుగుతుండేవి. బెజవాడ బందరుకన్నా దగ్గరే అయినా ఆయన బందరుకే తీసుకెళ్ళేవారు. పరీక్షలొచ్చే సమయానికి బెజవాడనించి ఒక మెకానిక్ వచ్చి టైపు మిషన్లకి ఆయిల్ వేసి కండిషన్లో పెట్టేవాడు, రిబ్బన్లు మార్చి కొత్తవి వేసేవాడు. పరీక్షకి ముందురోజునో, లేక పొద్దునో ఆ టైపు మిషిన్లంటినీ బస్సుటాపు మీదికి ఎక్కించి వెంట తీసుకువెళ్లేవారు సత్యనారాయణ గారు. పరీక్షహాల్లో బయటే నుంచుని ఆదుర్దాగా నిరీక్షిస్తుండేవారు. స్పీడుటెస్టు అయిన తరువాత మెకానిజం పరీక్ష కూడా వుండేది. టైపుమిషన్‌లో తప్పుల్ని (పరీక్షకోసం కృత్రిమంగా కల్పించిన) గుర్తించటం, దాన్ని బాగుచేసి మళ్లీ యధాస్థితికి తీసుకురావటం దాని వుద్దేశ్యం. రిజల్టు వచ్చిననాడు ఆయన ఆనందం పట్టలేకపోయేవారు. అలాగే





షార్టుహ్యాండు పరీక్షలు కూడా. అన్నీ స్వంత పర్యవేక్షణలోనే జరిపేవారు. ఇలా కొంతకాలం గడిచిన తరవాత ఒక అపశృతి దొర్లింది.

సత్యనారాయణగారు వ్యాపారరీత్యా దీన్ని నడపక, కేవలం పదిమందికి ఉపాధి కల్పించే ఉద్దేశ్యంతోనే నడపడం వల్ల ఎంతకాలం పాత మిషన్లతోనే గడుపుకొచ్చారాయన. అండర్‌వుడ్, వుడ్‌స్టాక్ లాంటి రెండో యుద్ధానికి ముందు తరానికి చెందినవి ఆ మెషిన్లు. మెటల్ కీస్‌ని నొక్కటం కష్టంగా వుండేది. షార్టుహ్యాండు విద్యార్థుల సంఖ్య పెరుగుతూనే వున్నా క్రమంగా టైపు విద్యార్థుల సంఖ్య తగ్గటం మొదలైంది. దీనికి కారణం మెయిన్‌రోడ్డుకి దగ్గరలో లతీఫ్ అనే అతను లతీఫ్ టైప్ ఇనిస్టిట్యూట్‌ని తెరిచాడు. దాంట్లో అప్పుడే మార్కెట్లోకి వచ్చిన కొత్త రెమింగ్టన్ మిషన్లని పెట్టాడు. ఫీజు ఎక్కువే అయినా కొత్త మిషన్లు కావడం, ప్లాస్టిక్ కీస్‌తో వున్న రెమింగ్టన్ మీద టైపు చెయ్యటం సులభంగా వుండేది.

విషయాన్ని ఆలస్యంగా గుర్తించిన సత్యనారాయణగారు క్రమేపీ రెమింగ్టన్ మెషీన్లు కొన్ని కొత్తవీ, మరికొన్ని సెకెండ్ హ్యాండ్‌వి కొని ఆధునికరించారు. మళ్లీ బిలబిలమంటూ నేర్చుకునేవాళ్ళు పోగయ్యారు. ఆంధ్రా టైప్ ఇనిస్టిట్యూట్ పోగొట్టుకున్న ప్రాభవాన్ని తిరిగి తెచ్చుకుంది. కొద్ది రోజుల్లోనే లతీఫ్ ఇనిస్టిట్యూట్ కేవలం జాబ్‌వర్కులకి పరితమైంది. ఇలా దశాబ్దాలపాటు కొద్దోగొప్పో మాత్రం ఫీజు వసూలు చేసి కొన్ని వందలాదిమందికి టైపిస్టు, స్టెనోగ్రాఫర్ వుద్యోగాలు దొరికేందుకు దోహదం చేసిన సీతంరాజు సత్యనారాయణ గారు నిస్వార్థజీవి, చిరస్మరణీయుడు ఆయన ఒక్క య్యూరుకే ఉపకారి కాదు, చుట్టుపక్కలున్న మరెన్నో ఊళ్ళకి ఉపకారి.

* * *



## గుండువారు గుండువారు కాదట... కొలచలవారట

మా మేనమామ గారి యిల్లు, మాయిల్లు పక్క పక్కనే వున్నాయి. మా మాతామహులు మా అమ్మ, మేనమామాల చిన్నతనంలోనే కాలం చెయ్యటంతో వాళ్ల పినతండ్రి గుండు లక్ష్మీనరసింహ శాస్త్రిగారు యుక్తవయసులో భార్య చనిపోయినా మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా వీళ్ళిద్దర్నీ పెంచి పెద్ద చేశారట. ఆయన్ని అందరూ నరసయ్యగారనే సంబోధిస్తుండేవాళ్ళు. అలాగే మా మేనమామగారి పేరు గుండు గంగాధరశాస్త్రి అయినా అందరికీ ఆయన గంగయ్యగారనే పరిచయం. ముప్ఫయి ఎకరాల పై చిలుకు మాగాణి పొలంతోపాటు పదెకరాల మామిడితోట కూడా వుండేది. అక్కడే బోలెడు తాడిచెట్లు వుండేవి. వేసవికాలం వస్తే చాలు తోటలోంచి వూరగాయ కోసం మామిడికాయలు, తాడి ముంజెలు కొట్టి వెస్తుండేవాళ్లు పాలేర్లు. మా మామయ్య దగ్గరుండి ముంజెలు తినిపిస్తుండేవాడు. ఆయన దగ్గర మా అందరికీ చాలా స్వతంత్రం వుండేది. ఆయనతో కలిసి వూరెడితే చాలు, ముందు బెజవాడలో లక్ష్మీటాకీసుకి ఎదురుగా వున్న అజంతా హోటల్లో టిఫిను తినిపించేవాడు. రవ్వదోసె మొదటిసారి రుచి చూసింది అక్కడే, ఆయన చలవే. జీడిపప్పులు బాగా వేసేవారందులో.

నరసయ్యగారు చూడటానికి గాంధీగారిలో వుండేవారు. మోకాలు పైకి కట్టిన కొల్లాయిగుడ్డ, వుత్తరీయం, వానాకాలంలో తాటాకు గొడుగు వేసుకుని వ్యవసాయం చేయిస్తూ వూళ్ళో రాచకార్యాలన్నీ చక్కబెడుతుండేవారు. పొద్దున్నే నూతి గట్టున స్నానం చేస్తూ *అహం బ్రహ్మాస్మి, బ్రహ్మాయివాహం* అంటూ వినిపిస్తుంటే ఆయన వూళ్ళోనే వున్నాడని అర్థం. అప్పుడు మనది మద్రాసు రాష్ట్రం కావటం వల్ల రాష్ట్ర రాజధాని, హైకోర్టు మద్రాసులోనే వుండటంతో వూళ్ళో లిటిగేషన్సన్నీ నెత్తినేసుకుని మద్రాసులో నటరాజన్ అనే అడ్వకేట్ గారింట్లో నెలల తరబడి మకాముండేవారు. కుంపటి పెట్టుకుని యిన్ని గింజలు వుడకేసుకుని తినేవాడినని చెప్పేవారయన (ఈమధ్య వచ్చిన ముళ్లపూడి వెంకటరమణగారి కోతికొమ్మచ్చిలో కూడా బాపుగారి తండ్రి అడ్వకేటు సత్తిరాజు వేణుగోపాలరావుగారి గురించిన ప్రస్తావనలో మద్రాసులో ఆకాలం అడ్వకేట్లు క్లయంట్లకి యింట్లో భోజన వసతులు ఏర్పాటు చెయ్యటం మామూలని, కేసు గెలిస్తే క్లయింటు చెప్పపెట్టకుండా రైలెక్కేసి వుడాయించేవాడని, ఓడిపోతే రైలు ఛార్జీలు అడ్వకేటు నించి అప్పు తీసుకుని వెళ్ళేవాడని చమత్కరించారు).





తిథి, వార, నక్షత్రాల భేదం లేకుండా యింటికొచ్చిన వాడు అ-తిథి అని తాతినేని లక్ష్మయ్య చౌదరిగారు వ్యుత్పత్త్యార్థం చెబుతుండేవారు. ఆవిధంగా తిథి, వార, నక్షత్రాలే కాదు పగలు, రాత్రి అనకుండా అతిథులు, అభ్యాగతులు రోజుకి ఎంతమందో గంగయ్యగారి యింటికి వస్తుండేవాళ్ళు. చాలామంది దూరదూరాల్నించి నడిచి వస్తుండేవాళ్లు. ఇంట్లో అడుగు పెట్టగానే వాళ్ళంతకి వాళ్లు యింటి యిల్లాలైన శ్రీమతి మహాలక్ష్మమ్మ గారితో (ఈమధ్యనే కాలం చేశారీవిడ) 'అమ్మా, యివాళ దేవతార్చన మీ యింట్లోనేనమా' అని చెప్పుకుని ధోవతి తడిపి మడిగా ఆరేయటానికి యిచ్చేవాళ్ళు, లేకపోతే ఆవిడే, 'మడి కట్టుకోండి వడ్డిస్తా' అనేది. ఒకవేళ ఏదో కారణంగా భోజనాలు త్వరగా అయిపోయుంటే మళ్ళీ ఆవిడ స్నానంచేసి మడికట్టుకుని వాళ్లకోసం వంట చేసేది. వచ్చేవాళ్ళంతా వేద పండితులో, కూచిపూడి భాగవతులో, పూట గడవనివాళ్ళో, సంగీత విద్వాంసులో, సంభావన కోసం వచ్చిన వాళ్ళో. హంసలదీవి, శ్రీకాకుళం, ఘంటసాల, శాయిపురం లాంటి వూళ్ళనించి కాలినడకన బెజవాడకి వెడుతూ దారిలో భోజనం కోసం, విశ్రాంతి కోసం ఒకపూట ఉయ్యూరులో గడిపేవాళ్ళో అవటం విశేషం. ఒకవేళ ఆ యింట్లో వీలుకాదని తెలిసనవాళ్ళు 'మామ్మాగారూ' అంటూ మాయింటికి వచ్చేవాళ్ళు. వేద పండితులైతే మడి కట్టుకుని రెండు మూడు పనలు వేదం వల్లించి భోజనానికి కూర్చునేవాళ్ళు. కూచిపూడి భాగవతులు తదితరులు తమకి తెలిసిన విద్యని ప్రదర్శించి అర్ధరూపాయి సంభావన యిస్తే కళ్ళకద్దుకుని కృష్ణార్పణం అంటూ వేరే యిళ్ళకి వెడుతుండేవారు.

ఇలా తరతరాలుగా గుండువారింటికి కోడలుగా వచ్చిన ప్రతివారూ అతిథి, అభ్యాగతులకి విసుగులేకుండా పట్టెడు భోజనం పెడుతూ అనూచానంగా వస్తున్న సంప్రదాయాన్ని కొనసాగించిన ఘనత ఆ కుటుంబానికి చెందింది. అయితే దీని వల్ల వాళ్ల యింటి పేరు మారిపోయిందని చెబుతారు. ఒకప్పుడు వీరి యింటి పేరు కొలచల వారట, కానీ యింటి ముందు పెద్ద గుండురాయి వుండటంతో పరదేశీయులకి ఆనవాలు కోసం 'అదుగో వాళ్ళ యింటి ముందు పెద్ద గుండు వుంటుంది అదే వాళ్ల యిల్లు' అని గ్రామస్తులు దారి చెబుతుంటే కొంత కాలానికి – కొలచలవారు కాస్తా గుండు వారయారని ప్రతీతి. ఇది ఎన్ని తరాల ముందు జరిగిందో ఎవరూ చెప్పలేదు.

గంగయ్యగారి ప్రస్తావన వచ్చింది కనుక ఆయన్ని గురించి కొంత చెప్పుకోవాలి.

నల్లగా వున్నా మంచి విగ్రహం ఆయనది. దానికితోడు మంచి కంఠస్వరం, సంగీతంలో కూడా కొంత ప్రవేశం వుంది. బందరుకి యివతలున్న చిట్టిగూడూరులో చిన్నప్పుడు తెలుగు, సంస్కృతం అభ్యసించాడు కాని పి.ఓ.యల్ లాంటి పరీక్షలు పాసయినట్టు దాఖలాలు లేవు. వేదం కూడా చెప్పుకున్నాడు. తెలుగు పాఠాలు చెప్పేటప్పుడు రాగయుక్తంగా పద్యాలు పాడుతూ బాగా చెప్పేవాడాయన. టీచరు వుద్యోగం చేయాలన్న వుబలాటం వుండేదాయనకి, అయితే క్వాలిఫికేషన్ లేనందువల్ల దొరకలేదు. 1950 దశకంలో కాకాని వెంకటరత్నంగారు జిల్లా బోర్డు ప్రెసిడెంట్‌గా వున్నప్పుడు చాలాచోట్ల హైస్కూల్సు తెరిపించటం ఆయనకి ప్రోత్సాహాన్నిచ్చింది. కాలానుగుణంగా ఒక సంవత్సరంపాటు ఉయ్యూరు హైస్కూల్ల్ లోయర్ గ్రేడ్ తెలుగు టీచరుగా పోస్టింగు వచ్చిందాయనకి. ఆయన చిరకాలవాంఛ నెరవేరింది.

ఆయన టీచరుగా చేరటం స్కూల్లో టీచర్లందరికీ అక్షరాలా పండుగ అయింది. ఇంట్లో కావలసినంత ధాన్యం, పప్పులు, పాడీను. అసలే ఒకరికింత పెట్టాలనే అనూచానంగా వస్తున్న అనవాయితీని పాటిస్తున్నవాడాయె. మరింకేవిటి కొదవ. ఒక్కొక్కరోజు స్టీలు బిందెనిండా పైకి తేలుతున్న ద్రాక్ష, జీడిపప్పులతో కూడిన పాయసమో, వెదురుగంపనిండా గారెలో, బూరెలో, గంగాళమంత గిన్నెతో ఆవడలో, పులిహారనో – ఏదో ఒకటి స్కూల్లో టీచర్లకి తరచు విందు చేస్తుండే వాడాయన. దీన్ని గంగయ్య గారి టీ పార్టీ అనేవాళ్ళు. ఇలా నవ్వుతూ వున్నదాంట్లో నుంచి నలుగురికీ పంచిపెడుతూ గడిపాడాయన. వేసవి సెలవలొచ్చేసరికి హూస్టింగ్ ఆర్డర్సు వచ్చాయని తెలిసింది. 'పంతులుగారూ, మీకు క్వాలిఫికేషను లేదుకదా, ఫరవాలేదు మళ్లీ స్కూలు తెరిచే రోజుకి మీకు పోస్టింగ్ వస్తుందిలెండి' అన్నారట కాకాని. అలా ఒకటి రెండు సంవత్సరాలు పనిచేశాడాయన. ఒక సంవత్సరం ఈడుపుగల్లు స్కూలుకి బదిలీ అయింది. అక్కడా కొంతకాలం పైన చెప్పినట్టుగానే పులిహోరా, గారెలూ, బూరెలూ వగైరాలు యిప్పుడు బస్సులో మోసుకుని తీసుకెళ్ళడం మామూలైంది. ఎంత పండితుడైనా బేసిక్ క్వాలిఫికేషన్ కంపల్సరీ అని రూల్సు చెబుతున్నందువల్ల చివరికి ఆయన ఉద్యోగాన్ని చాలించవలసి వచ్చింది.

పెద్ద కూతురు రాజ్యలక్ష్మి వివాహం 1950కి ముందు జరిగింది. అది అయిదు రోజుల పెళ్ళి, మగ పెళ్ళివారు నూజివీడుకి చెందిన సూరివారు. ఆ అయిదు రోజులూ





వీధిలో ఎవరింటిలోనూ పొయ్యిలో పిల్లి లేవలేదు. కాఫీ, టిఫిన్ల దగ్గిర్నించీ రాత్రి భోజనాల వరకు అందరూ ఆ యింట్లోనే. ఆ పెళ్ళివి కేవలం కొన్ని సంఘటనలు మాత్రమే గుర్తున్నాయి కాని, వివరాలు అంత బాగా గుర్తులేవు. సాయంత్రం కాలక్షేపానికి ఆడ సంగీతం మేస్టారు (సంగీతం ఆడదని కాదు, మేస్టారు ఆడదని) వయొలిన్ వాయించి పాటకచేరి చేయ్యటం మాత్రం గుర్తుంది. బహుశా ఉయ్యూరులో అదే చిట్టచివరి అయిదు రోజుల పెళ్ళి. ఆ తరువాత ఎంతోమంది బంధువులు స్వంత యింట్లో వెసులుబాటు కాక వారి పిల్లల పెళ్ళిళ్ళు గంగయ్య గారింట్లో జరుపుకునేవారు, దానికాయన హృదయపూర్వకంగా స్వాగతించేవారు.

పెళ్ళిళ్ళ ప్రస్తావన వచ్చింది కనుక ఒకమాట. ఆడపెళ్ళివారింట్లో పెళ్ళి పనులకి నాందిగా యింట్లో వున్న రోలు, రోకలిని కడిగి శుభ్రం చేసి పసుపు కుంకుమలు అద్ది చుట్టుపక్కల ముత్తైదువులందరితో కలిసి పసుపు కొమ్ములు దంచటంతో పనులు ప్రారంభమవుతాయి. నానబెట్టిన వరి ధాన్యాన్ని మట్టి మూకుడులో వేయించి చెక్కరోలులో దంచి చెరిగి అటుకులు తయారుచేసేవారు. బూడిద గుమ్మడికాయలు తరిగి వడియాలు పెట్టటం, అప్పడాలు వత్తడం చెకచెకా జరిగిపోయేవి. పొద్దున్నే పదిగంటలకల్లా వీధిలో ఆడవాళ్లందరూ భోజనాలు ముగించుకుని అప్పడాలు వొత్తే పీటా, కర్రా పట్టుకుని పెళ్లివారింటికి చేరేలోపు యింటావిడ అప్పడాల పిండి తయారుగా పెట్టుంచేది. అందరూ తలాకాస్త పిండి, నూనె తీసుకుని వందలకి వందలు అప్పడాలు వొత్తేవారు, రెండు మూడు రోజులపాటు ఈ అప్పడాల తతంగం నడుస్తుండేది. పచ్చి అప్పడాల పిండి తినడానికి బాగుండేది, ఎక్కువ తిననిచ్చేవారు కాదు. గాజులవాళ్ళు ఎక్కడ్నించో మూటలు పట్టుకొని దిగేవారు. భోజనాల తరువాత మొదలైన గాజుల ఎంపిక దాదాపు చీకటి పడేదాక సాగుతుండేది. గాజులు యింటికోసమే కాదు, బంధువులకి, యిరుగుపొరుగువారికీ కూడా.

తరువాత అత్తరు సాయిబుకి కబురు వెళ్ళేది. అతని అసలు పేరేమిటో తెలీదు కాని గళ్ల లుంగీ, తెల్లటి లాల్చీ, పొడుగాటి తెల్ల గడ్డమూ తలపాగాతో బుజాన బరువైన పెద్ద చెక్క పెట్టెలో దళసరి సీసాల్లో రంగు రంగుల నూనెలు, రకరకాల అత్తర్లు పెట్టుకుని మోసుకుంటూ వూర్లోనూ చుట్టుపక్కలా – అత్తారూ, నిమ్మానూనె, మందార్నూనే, కళ్ల కజుపుల్కి సుర్మా, కళ్ల ఎరుపుల్కి సుర్మా అని అరుస్తూ తిరుగుతుండేవాడు. వయసు

డెబ్బయికి పైన వుండొచ్చు. ఇంటికి రాగానే బుజాన్నించి మూటగా కట్టిన పెట్టెని దింపుతూ – బిస్మిల్లా ఇబ్రహిమా నిర్రహీం అనేవాడు. అతను రాగానే ఎక్కడినించి చూసేవాడో మావయ్య, 'ఒరేయ, రాచిప్ప తెండర్రా అత్తరు కొందాం' అంటూ పరాచకాలాడేవాడు. చివరికి కొంచెం నిమ్మనూనో, మందారనూనో కొని యింటిల్లిపాదీ కళ్ళకి సుర్మా పెట్టించుకునే వాళ్ళం. చూడ్డానికి యినుప రజనులా బరకగా వుండే సుర్మాని దబ్బనమంత పొడుగాటి కాడతో రెప్పలు విడదీసి అద్దేవాడతను. వెంటనే టపటపా నీళ్లు కారేవి. పరవాలేదు, సలవ చేస్తుంది. అనేవాడు సుర్మా /అత్తరు సాయిబు.

పెళ్ళికి కావలసిన ముఖ్యమైన వస్తువుల్లో ఆరోజుల్లో బాగా ప్రాచుర్యంలో వున్న ప్రెసిడెంట్ వెజిటబుల్ హెయిరాయిల్ – పెద్ద సీసా ఒకటి విడిదిలో పెళ్ళివారికి ప్రత్యేకంగా వుంచటం మర్యాద. మైసూర్ శాండల్ సబ్బులకి కూడా అంతే ప్రాముఖ్యత. పెళ్ళికి వచ్చిన బంధువులు పడుకునేందుకు రకరకాల సైజుల్లో ఈత చాపలు, భాజా బజంత్రీల వాళ్లకి ఏకంగా కింగ్ సైజ్ చాప, కొన్ని తాటాకు చాపలు (ఈతాకు చాపలకన్నా ఇవి మెత్తగా వుంటాయి) కొనడం ముఖ్యమైన పని. ఇంటిముందు, వెనుక పందిరి వెయ్యటానికి కావలసిన పచ్చి తాటాకులనించి, కొత్త ఈత చాపల నుంచి వచ్చే పచ్చి వాసన అందమైన వాసన – శుభకార్యాలకే ప్రత్యేకమైన వాసన. పెళ్ళికి పదిరోజులముందే వచ్చిన బంధువులు కొంతమంది పదహారు రోజుల పండుగ వెళ్ళేదాకా వుండేవారు. వుండిపొమ్మని బలవంత పెట్టేవారు కూడా.

గుండు గంగయ్యగారికి ఉయ్యూరుకి నాలుగు మైళ్ళ దూరంలో వున్న కనకవల్లిలో శివాలయం వుంది. దాని జీర్ణోద్ధారణతో బాటు విగ్రహ ప్రతిష్టకి కూడా పూనుకున్నారోసారి. వారం రోజులపాటు మా కుటుంబం, మా మామయ్యగారి కుటుంబం కనకవల్లిలోనే మకాం. ఆ వారం రోజులూ కనకవల్లి వూరివాళ్ళు వంటలు వండుకోలేదు, ఆఖరికి కాఫీ, టిఫిన్లు కూడా గుడి చుట్టూ వేయించిన తాటాకు పందిళ్ళలోనే. పందిట్లో నిండుగా నిండిన భోజన పంక్తుల మధ్యలో గంగాధరశాస్త్రి గారు నేతిజారీ పట్టుకుని అందరికీ నెయ్యిని జారీ కొమ్ములోంచి పంపి వడ్డిస్తూ, ఒకరోజు – భిక్షాందేహి కృపాలంబనకరీ మతాన్నపూర్ణేశ్వరీ ... అంటూ అన్నపూర్ణాష్టకంలోని శ్లోకాలు, యింకోరోజు కదాచిత్కాళిందీ తటవిపిన సంగీత కవరే ... అంటూ జగన్నాథాష్టకంలోని శ్లోకాలు రాగయుక్తంగా పాడుతూ భోజనం మధ్యలో భగవన్నామ





సంకీర్తన చేస్తూంటే అంత మందికి అతిధ్యాన్ని యిచ్చిన తృప్తి ఆయన ముఖంలో కొట్టొచ్చినట్టు కనబడేది. కాలగమనంలో సనాతన సంప్రదాయాలు అంతరిస్తున్న ఆనాటి సమాజానికి చిట్టచివరి ప్రతీకగా నిలిచిపోయారాయన.

విగ్రహ ప్రతిష్టలో భాగంగా చేసిన యాగానికి యాగబ్రహ్మ శ్రీ వంగల సుబ్బావధానులుగారు – ఉయ్యూరు వూరి పురోహితుడు. మంచి శరీర దారుఢ్యం వున్న వ్యక్తి. మంత్రాల్లో దిట్ట. శివాలయంలో దేవీ నవరాత్రుల సమయంలో రాత్రి ఎనిమిదీ ఎనిమిదిన్నరకి తొమ్మిది రోజులూ మంత్ర పుష్పం చెప్పేటప్పుడు అది కంఠతా వచ్చిన వాళ్లు రెండు గ్రూపులుగా దేవుడికి యిరు పక్కలా నుంచేనేవారు. ఒకదాంట్లో సుబ్బయ్య గారు, కోట కృష్ణమూర్తి గారు వగైరాలు, మరోదాంట్లో గంగాధరశాస్త్రి గారు, యనమండ్ర పార్థసారధి వగైరాలు – యేవం వేదా యోపామాయతనం వేదా ... అని ఒక గుంపు అంటే మరో గుంపు ఆయతనవాన్ భవతి ... అంటూ దాదాపు యిరవై నిమిషాలు సాగే మంత్ర పుష్పం వింటుంటే వొళ్లు పులకరించేది. మంత్ర ముగ్ధులవటం అంటే యిదే గావుల్ను అనుకొని యింత గొప్పగా దేవుడ్ని స్తుతిస్తుంటే మరి సినిమాల్లో లాగా దేవుడు ప్రత్యక్షం కావటం లేదెందుకని అనిపిస్తుండేది.

ఈ కార్యక్రమాన్ని శివాలయంలో ముగించి ప్రసాదం తీసుకుని వారిలో చాలామంది విష్ణాలయానికి వెళ్ళి మళ్ళీ అక్కడ మంత్ర పుష్పం చదివేవారు. వేదాంతం రామాచార్యులు గారు పూజారిగా వుంటే ఆయన చేరి ఆ మంత్ర పుష్పాన్ని మరింత రక్తి కట్టించేవారు. సుబ్బయ్య గారు, గంగయ్య గారు కలసి హోమానికి కావలసిన హవిస్సు కోసం చెక్క యంత్రంలో చెకుముకి రాయిని, పత్తిని పెట్టి మధిస్తూ వుంటే చాలా సేపటికి అగ్ని పుట్టింది. ఆదిమానవులు ఎంత కష్టపడితే నిప్పు రాజుకుండేదో అప్పుడర్థమైంది మాకు. స్కూలుకి పోయే మేమందరం పొద్దున్నే టిఫిన్లు తిని, టిఫిన్ క్యారియర్ చేత్తో పట్టుకుని పొలాల గట్ట వెంబడి నడుస్తూ ఆ వారం రోజులూ ఉయ్యూరులో స్కూలుకొచ్చి పోతుంటే యాకమూరు, కనకవల్లి, గరికపర్రు నుంచి రోజూ పిల్లలు ఎంత కష్టపడి వస్తుండేవారో అప్పుడు తెలుసుకున్నాం.

కాలక్రమేణా యిల్లాలు మహాలక్ష్మమ్మ గారికి ఓపిక నశించింది, రవాణా సౌకర్యాలు అభివృద్ధి చెందటంతో అపసోపాలు పడుతూ అలా గుండువారి యిల్లు వెతుక్కుంటూ వచ్చేవారి సంఖ్య కూడా తగ్గసాగింది. వీలు కానప్పుడు నిర్మొహమాటంగా

మాయింట్లో వీలుకాదండి, మరెక్కడన్నా చూసుకోండి అని చెప్పసాగారు. అప్పుడు కొంతకాలం మా యింటికి వస్తుండేవాళ్లు. అది కూడా తగ్గి అనూచానంగా వస్తున్న ఒక సదుపాయానికి తెర పడింది. కొంత మంది సత్రానికి వెడుతుండేవారు. సత్రాలు కబ్జాకి గురి కావడంతో ఆ వ్యవస్థ కూడా అంతరించింది.

కొలచలవారి కుటుంబాలు రెండు మూడు వుండేవి. వారి యిళ్ళు కాలేజి రోడ్డు మొదట్లో వున్నాయి. వారిలో కొలచల వెంకట్రామయ్య గారు స్వతహా వ్యవహార దక్షుడు. చిన్న చిన్న తగాదాలకి పరిష్కారం యిస్తుండేవారు. కాస్తంత నత్తి వుండేది. వున్నటుండి కోపం చాలా వస్తుండేదాయనకి. కోర్టువ్యవహారాలతో పరిచయం వుండటంతో ప్రామిసరీ నోట్లు రాయించడం దగ్గిర్నుంచీ దస్తావేజులు రాయటం (ఆన 1952వ సంవత్సరం ఉయ్యూరు గ్రామ కాపురస్తులు .... వ్రాయించి యిచ్చినది .... వ్రాలు, ఇందుకు సాక్షులు) వరకూ చాలామంది ఆయన మీదనే ఆధారపడుతుండేవారు. సలహా కోసం వచ్చిన వాళ్ళతో పదకొండు గంటలకల్లా 'సబ్ రిజిస్ట్రారాఫీసులో కలవండ్రా' అని చెప్పి వుత్తర్యం దులుపుకుని బుజానేసుకుని యింటికెళ్ళేవారు. ఆయన రాసిన దస్తావేసులు చదవటానికి చాలా యిబ్బందిగా వుండేవి. జెరాక్సు మిషన్లు, తెలుగు టైపింగులేని ఆ రోజుల్లో చేత్తోనే నకళ్లు (కాపీలు) రాయాల్సి వచ్చేది. రెండో వ్యక్తి కొలచల శ్రీరామమూర్తి గారు. మొదట్లో అడితీ సత్యంగారి అడితీకి (పెద్దవంతెనకి యివతల వున్నప్పుడు) సైకిలు మీద రోజూ వుద్యోగంగానో వ్యాపకంగానో వెళ్ళి వస్తుండేవారు. కళ్ళకి చలవద్దాలు కూడా వుండేవప్పుడు. అది మానేసిన తరువాత ఉయ్యూరులో ఒక అమెచూర్ అర్కిటెక్టుగా, సివిలింజనీరుగా ఎన్నో యిళ్ళు, భవంతులు ఆయన సూపర్విజన్లో నిర్మితమైనాయి. ఆరోజుల్లో తాపీ పనికి, వడ్రంగి పనికి ఎక్కువగా ముస్లిములే వుండేవారు. శ్రీరామమూర్తి గారికి ఉర్దూలో వుండటంతో వాళ్లకి ఆ భాషలో ఆయన సలహాలిస్తుంటే చూడ్డానికి మాకు తమాషాగా వుంటుండేది. కట్టడం పూర్తయి పుణ్యాఃవచనం చేసేదాకా యింటి యజమానికి తోడుగా, సలహాదారుగా వుండేవారు. దానికి ప్రతిఫలం – యజమాని గృహప్రవేశం సందర్భంలో నలుగురితోనూ కలిసి చేసే భోజనం మాత్రమే. కేవలం కామన్ సెన్సు వుపయోగించి ఆయన కట్టించినవి కొన్ని యింకా చెక్కు చెదరకుండా వుండటం విశేషం.

***





## పూరవారి దుకాణంలో వెచ్చాలు

శివాలయం వీధిలో కొంత ముందుకొస్తే కుడివైపు రాజావారి ఠాణా వుండేదని, గంటలు కొడుతుండేవారని, ఆ ఠాణాని పూరవారు కొన్నారని యింతకుముందు చెప్పుకున్నాం. ఆ ఠాణా లోగిలి చాలా పెద్దది. సింహద్వారం యిటు శివాలయం వీధి వైపున వుంటే తెనక తలుపు విష్ణాలయం వీధి వైపుకుండేది. పూరవారు వైశ్యులు, వూళ్ళో మొట్టమొదటి హోల్‌సేల్ అండ్ రిటైల్ పచారీ షాపు వారిదే. ఆ దుకాణం విష్ణాలయం వీధి వైపుగా కొత్తగా కట్టించిన డాబాలో వుండేది. ఇల్లు చాలక దాని పక్కనే యింకో మేడ కట్టుకున్నారు.

1950 దశకం మొదట్లో పూర వెంకయ్య గారి దుకాణం అంటూ వ్యవహరించేవారు. వెంకయ్యగారు కాలం చేసినా వ్యవహారంలో అదే పేరు వుండేది. వెంకయ్యగారికి ముగ్గురు కొడుకులు – పెద్దాయన వెంకటేశ్వరరావు, రెండో ఆయన అసలు పేరేమిటో కాని పూర తాతయ్య అనే ప్రసిద్ధుడాయన. మూడో కుమారుడు పూర సుబ్బారావు. పెద్దాయన ఎప్పుడూ దుకాణంలో కనిపించేవాడు కాదు – ఎప్పుడో ఒకసారి వచ్చి గల్లా పెట్టె దగ్గిర కూచున్న తమ్ముడు సుబ్బారావుని అడిగి ఒక బర్కిలీయో, గోల్డ్‌ఫ్లేకో సిగరెట్టు తీసుకుని వెలిగించుకుని వెళ్లిపోయేవాడు. తరువాత చాలా రోజులకి పూరి పాలిటిక్సులో ప్రమేయం కలిగించుకుని వార్డు మెంబరుగానూ, పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగానూ చురుగ్గా పనిచేసేవారు. రోటరీ క్లబ్బు స్థాపించిన వారిలో ఆయనొకరు. తాతయ్య గారు మాత్రం బెజవాడ నించి దుకాణానికి కావలసిన సరుకులు హోల్‌సేల్‌లో కొని లారీల్లో ఉయ్యూరుకి రవాణా చేయించే పనిలో వుండేవాడు. అందువల్ల తరచూ దుకాణంలో కనిపిస్తుండేవాడు కాదు.

మూడో సోదరుడు పూర సుబ్బారావు వూళ్లో అందరికీ పరిచయం. పొద్దున కాలవలో స్నానం చేశొచ్చి దుకాణంలో చిన్న పీట వేసుకుని గల్లా పెట్టె ముందు కూచుంటే మళ్లీ ఏ రాత్రికో లేచేవాడు. ఆరోజుల్లో మధ్య తరగతి వాళ్లందరికీ కొద్దో గొప్పో పొలం వుంటుండేది. దాంట్లో బియ్యంతోపాటు పెసలు, మినుములు పండుతుండేవి. ఈ మూడూ మినహా మిగిలిన వన్నిటికీ ఆధారం సాధారణంగా పూర వెంకయ్యగారి దుకాణమే. కొంతకాలానికి పూరా బ్రదర్సు అని మారింది.

మాయింట్లోకి కావలసిన సరుకులు – వెచ్చాలు – లిస్టు రాసుకుని వెడితే తిరిగి రావటానికి మూడు నాలుగు గంటలు పట్టేది. చూడంగానే వూర సుబ్బారావు వెచ్చాల జాబితా చేతిలోకి తీసుకునేవాడు. ఈ లోపల గరికపర్రు నించో, యాకమూరు నించో సైకిలేసుకుని (అప్పటికింకా రిక్షాలు రాలేదు – జట్కాలు కొన్ని, ఒంటెద్దు బళ్ళు మరికొన్ని) టోకుగా వస్తువులు యిక్కడ కొని వూరికి తీసుకెళ్ళి అమ్మటానికి వచ్చేవారెవరో. అంతే, దాంతో మా లిస్టు పక్కన పెట్టి – 'ఏయ్, పాండూ చార్మినార్ ఒక దిండూ, బర్కిలీ అరదిండూ, బీడీలు రెండు దిండ్లు' – అలా వరసగా చెప్పుకుపోతూ, 'పంతులుగారూ, కూచోండా బల్లమీద' అని అక్కడున్న పొడుగాటి బల్లమీద కూచోపెట్టేవాడు. అలా ఒక అరగంట గడిచి, వాళ్ళిచ్చిన డబ్బుని రెండు మూడుసార్లు లెక్కేసుకుని దాచి మళ్ళీ మా సంగతి చూడటానికి ప్రయత్నం చేసేవాడు. కాసేపట్లో చిల్లర బేరాలొచ్చేవి. అవన్నీ యిప్పిచ్చి, 'పాండూ, శాల్లీలెక్కేయరా' అన్నప్పుడు ఆ దండకం ఎలా వుంటుండేది.

కందిపప్పు …… బేడ (రూపాయలో ఎనిమిదవ వంతు)

పెసరపప్పు ….. అణా (రూపాయలో పదహారవ వంతు)

ధనియాలు ….. అర్ధణా (అణాలో సగం)

మిరపకాయలు …… కానీ (అణాలో నాలుగవ వంతు)

మొత్తం మూడణాల ముక్కానీ (యిప్పటి యిరవై పైసలుకి సమానం). 'రానీ, త్యా' అంటూ వచ్చిన అమ్మాయినో, అబ్బాయినో గట్టిగా గద్దిస్తూ అడిగేవాడు. వాళ్ళు డబ్బులు తీస్తూ పాలబెల్లం ముక్క కొసరుగా యిమ్మని అడిగితే బూతులు తిడుతూ చిన్న పాలబెల్లం ముక్క తుంపి యిచ్చి పావలా యిచ్చినందుకు కానీ తిరిగిచ్చి, 'తీసేయ్ నా … లో (బూతు పదం) బేరం అని మరోమారు ఆశీర్వదించి పంపించేవాడు. చాలా కలర్‌ఫుల్ మనిషి. ఈలోపల యింకో టోకు వర్తకుడొస్తే మళ్ళీ కథ మామూలే. ఆ విధంగా మా షాపింగు ముగించటానికి కనీసం మూడు నాలుగు గంటలు పట్టేది. ఆకలితో కడుపు దహించుకుపోతున్నా వూర సుబ్బారావుగారి దుకాణంలో కాలక్షేపానికి కొదవుండేది కాదు. వస్తువులన్నీ న్యూస్ పేపరులో త్రికోణాకారంగా పొట్లాలు కట్టి లిస్టు ప్రకారం మరోసారి చూసి, బిల్లు కూడి (ఆయన బిల్లు కూడటం కూడా తమాషాగా వుండేది !) ఎర్రగుడ్డ కవరున్న ఖాతా పుస్తకంలో రాసుకునేవాడు. లిపి, అంకెలు వేరే





భాషలో వుండేవి. మోడీ లిపి అని ఎవరో అనేవాళ్ళు, మొత్తానికి సామాన్యులకి అర్థంకాని లిపిలో పద్దులుండేవి. పంటల డబ్బొచ్చిన తరువాతనే చెల్లింపు – ఉద్యోగులు తప్ప.

దీపావళి పండగొస్తే మళ్ళీ వూర సుబ్బారావుగారే. మతాబులకి చిచ్చుబుడ్లకి కావలసిన సరంజామా – గంధకం, సురేకారం, రజను (మెగ్నీషియం మెటల్ ఫ్లేక్స్) దొరికేవక్కడ. అవి విడిగా కొని ఎండబెట్టి రజనుకి ఆముదం నూనె పూసి మిగిలిన వాటిని కలిపి ఎండబెట్టి మందు తయారుచేసి యింట్లోనే కూరేవాళ్ళం అందరం. కొంతకాలం తరువాత తయారుగా వున్న మందు మిశ్రమాన్ని అమ్మేవారు. దాంతో కూరేవాళ్ళం. దీపావళి వారం రోజులుందనగా వూర సుబ్బారావు దుకాణం బయట అరుగుల పక్కన టపాకాయల షాపు పెట్టేవారు. నరక చతుర్థశికి ముందే కొని వుంచుకుని తెల్లవారుజావునే టపాకాయలు పేల్చి (కాల్చి) తలంటి పోసుకునేవాళ్ళం. తాటాకు టపాకాయలు చాలా చవకగా వుండేవి.

కొంతకాలానికి వారసులు ఆ దుకాణాన్ని మెయిన్‌రోడ్డులోకి మార్చారు. సినిమాహాలు కట్టారు, వ్యాపకం పెంచుకున్నారు. వీటితో ప్రమేయం పెట్టుకోకుండా వూర సుబ్బారావు గారు చాలా కాలంపాటు పొద్దున తొమ్మిది గంటలకి కొల్లాయి గుడ్డ కట్టుకుని కాలవలో స్నానానికి వెడుతూ కనిపిస్తుండేవారు. దుకాణానికి వచ్చిన వాళ్ళందరితో చనువుగా కలిసి మెలిసి గడుపుతూ నోటికి ఎప్పుడూ తాళం వెయ్యని మనిషి కాలవకి వెడుతూ దానిలో ఎవర్నీ పలకరించకుండా మౌనంగా తన మానానా తను వుండటం ఆశ్చర్యం కలిగిస్తుండేది.

***

